సీ॥ "దుగ్ధాంబునిధినిట్టఁదోఁచెనోయని శేషుఁ
బాన్పుగా హరినిటఁబవ్వడింపఁ
నాదవి సుధారస ముప్పొంగె నోయని
దేవతల్ తనివోవఁద్రావఁదలఁపఁ
దొలఁకాడుమిన్నేఱు వెలివిరిసెనో యని
లీల సురాంగన లోలలాడఁ
పాదరసం బుర్విఁ బరఁగెనోయని సిద్ధ
నికరంబు కలశముల్ నించికొనఁగఁ

పాండురాంగుండు విశ్వరూపంబుదాల్చి
మెలసెనోయనిసద్భక్తి తెలిమిఁగొలువ
నఖిలజీవుల కానంద మతిశయిల్ల
నచ్చ వెన్నెలవిమలమైయలరెకానె." —కుమా = ఆ.౮

సీ॥ గంగాప్రవాహంబు కాఁబోలునని వశి
ష్ఠాదు లనుష్ఠాన మాచరింప
నమృతంబు వెల్లువయని నిలింపాదులు
మునుకొని వోసిళ్ళ ముంచిక్రోల
దుగ్ధాంబునిధి యని తోయజాక్షుఁడు శేష
పర్యంక మెక్కొని పవ్వడింపఁ
బరమేశువిశ్వరూపం బని బ్రహ్మాదు
లమర దండ ప్రణామములు సేయఁ

దలఁపఘానఘోంతరముల కొలఁదితెలిసి
పెరసియెన్మిది దిక్కులఁబొరలిపొరలి
దట్టముగనంతకంతకుఁ దనరితనరి
యుట్టిలంబుగవెన్నెల నిట్టవొడిచె."

—జక్కన విక్రమార్క చరిత్రము.

వేయేల, యితని కావ్యమును తిక్కన, కేతన, మంచన, నాచన సోముఁడు, అమరేశ్వరుఁడు, చిన్నకోట పెద్దన, సూరనలు, రామలింగఁడు, కొందఱు లాక్షణికులును చదివినట్లు తెలియుచున్నది. "త ఏవపదవిన్యాసా

స్తావేవార్థవిభూతయః। తథాపినవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్" అను వాక్యము కేతన సోమనాథాదులయందుఁగూడ వ్యక్తమగుచున్నది.

నన్నెచోడుని కుమారసంభవము నానావిధాలంకారములకును, నపూర్వ వ్యాకరణలక్షణములకును, కొన్ని శబ్దచిత్రములకును, భావ, వ్యంగ్య, ధ్వనులకును లక్ష్యము లిచ్చుటయందుఁ బ్రథమగణ్యముగా నున్నది. ఈ కవికిఁ బూర్వము సంస్కృతమున నెందఱో మహాకవులున్నను గ్రంథచౌర్య మగ పడదు. "ముదమునసత్కవితామృతము। నదరకవిలుకాని పట్టినమ్మును బరహృద్భి। దమై తలయూపింపనియది కావ్యమె వాని పట్టినదియుం గరమే" యనునది మాత్రమే "కింకవేస్తస్యకావ్యేన కింకాండేన ధనుష్మతః పరస్యహృదయేలగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః"యను శ్లోకార్థమునుండి గ్రహింపఁబడినది. దీనిలోఁ గొన్ని యత్యాశ్చర్యజనకములగు భావములుగలవు. అట్టిపద్యము లీ ముద్రిత భాగములోనే కొన్నిగలవు. వానికిఁజూడఁగా 'తత్తత్సమగ్ర బహుశాస్త్ర విమర్శసిద్ధవైదగ్ధ్య దిగ్ధమతయో బహవః కవంతాం, యత్కించిదస్తి తు మహాకవి వాగ్రహస్యంస్వప్నేఽపి తస్యకిలతేన దిశం స్పృశంతి' యనియు, ఆ'సంసారం (సృష్టి) కవిపుంగవైః ప్రతిదివసగృహీతసారోఽపి। అద్యావ్యభిన్న ముద్ర ఇవ జయతి వాక్పరిస్పందః' అని మంకుకవాక్ప్రతికవులు సూచించిన వాక్యములు నిక్కములని తోచుచున్నది. మఱియు నీకవి,'ఓలినకడచననఱువది। నాలుగు విద్యలను నేర్పు నైసర్గికమై। వాలినసుకవులనుంగా కేలతరమెకృతులు చెప్ప నెవ్వరికైనన్' అని చెప్పుకొన్నట్లు సర్వజ్ఞుఁడని చెప్పుటకుఁ దగిన సూచనలు కావ్యములో నగపడుచున్నవి. ఆంధ్రకవులలో నిట్టివారు తిక్కన, నాచనసోముఁడు, ఎఱ్ఱాప్రెగ్గడయు మాత్రమే.

ఇతని కాలములో దీర్ఘము మీఁది యర్ధబిందువు పూర్ణబిందువుగానే వాడు చున్నట్లును కృష్ణదేవరాయల కాలమునకే యది యర్ధబిందు వయ్యెననియు నీకృతివలనఁ దెలుచున్నది. దీర్ఘములమీఁద నెలవున్నలు సోముఁడుకూడఁ బ్రయోగించి యున్నాఁడు. చూడుఁడు;ఉ.''ఎంచిన ప్రేమనేవపకమిమ్మని రుక్మిణి మున్ను వేఁడుడుం। పూంచినపూఁవు దక్కఁ బలుపోకలఁ బోవుచునుండు దేవుఁడున్। దాంచినసొమ్ముచేరె నకటా మదిఁగోరని సత్యభామకున్। నోంచిన వారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే యిలన్'', ''ఘంటాకర్ణుఁడు నేను నా

యనుజుఁడీ కాలాంతకుండేము—మృత్యుంజయస్…జంపస్ … వేటంబోయితి మేని' అని. ఇందు, ఏచుశబ్దమున నరసున్న యీ యర్థమున లేదు; వేఁట యనుటకు వెంటపడు రూపాంతరము స్థలాంతరమున నెచటలేదు. భీమకవి నృసింహపురాణమున, "వాండమినట్ల సిద్ధిజనపక్ష్మపుఁదోర్చిన రాజభీరుఁడై। యాంధ్రవసుగానకుండ వృషభాంతముపెట్టి కొనంగఁ జూచితో। నేండిచెపేమి నీవనుచు నెచ్చెలులెల్ల హసింప నంతలో। మూండపకంటితోడి దొరమూర్తి వహించిన మ్రొక్కిరంగనల్" అని చెప్పియున్నది కావుననే శ్రీనాథునివంటివారు నర్ధబిందుప్రాసమును సడలనీయక ప్రయోగించిరి. నన్నయాదులు నిర్బిందువు నర్ధబిందువును గలపిరని యప్పకవ్యాదులు చూపిన ప్రయోగములన్నియు వారి యల్పజ్ఞానము సూచించుచున్నది. అప్పకవియు, కూచిమంచి తిమ్మకవియు నుదాహరించిన పద్యములన్నియు లక్షణసారసంగ్రహ, కవిసంజీవని, కవి చింతామణి, లక్షణశిరోమణులు—వీనిలోనే యున్నవి. చీకటి, వీపు, శబ్దములలో నరసున్న లేదు. ఉన్నట్లు ప్రామాణిక కవులలోఁ బ్రయోగములు లేవు. కవిత్రయ, నాచనసోమన, నన్నెచోళ, కవిభల్లట, విన్నకోట పెద్దన, శ్రీనాథ. కేతనలు, ప్రాససంకరము చేసినవారు కారు. చీకటిశబ్దమునకు భారత దశ కుమార చరిత్రలలోని ప్రయోగములు చూపితిని. వీపుశబ్దమునకు నాదిపర్వము లోని ప్రయోగముగాక 'వీపుననబ్ధి నొక్క వృషభేషరమున్ దగఁదాల్చెనంచు లక్ష్మీపతి' అని నృసింహ - ఆ-౪-౧౧౦ లోను, 'వీపునమోపెఁ గచ్ఛపము పెంపిభుజంగమరాజు మస్తకస్థాపితఁజేసె నీవు వసుధారమణిం బెనకోమటీంద్ర బాహాపరిరంభగుంభ సముదంచితఁ జేయుటయింత యొప్పునే మోపరులేమెఱుం గుదురు ముగ్ధలతోడి విహారధర్మముల్' అనియు నెఱ్ఱాప్రెగ్గడ ప్రయోగించి యున్నాఁడు. తీగ, శబ్దములో నరసున్న లేదు. 'డాగు' అనుటకు నెగయు నను నర్థమున నరసున్న లేదు. మూగుశబ్దమునకు రెండురూపములు ద్రవిడ కర్ణాట భాషలలోఁగూడఁ గలవు. బాగుశబ్దము ప్రాచీన నవీనరూపములు రెండు. ప్రాచీనరూపములో నరసున్న గలదు. 'యాంగువాఌ యిర్కళు మప్పుంబులఁగళుం। బాంగు బమ్మణ్ణేట్టర్ పణ్ణుకగుత్తు' అని మహామేఘల-ఆ-౬. ౧౫౯. ఇందు 'బాఁగు' అనఁ బ్రకారము. కావునఁ బైపదముల నుంచుకొని యప్పకవి, ముద్దరాజు రామన, కస్తూరి రంగకవి, గణపవరపు వేంకటకవి, తిమ్మకవి—వీర లుదాహరించిన సంకరప్రాసములు శోధించినయెడల వీరి పాండిత్యమే సంకరమని తోచును. ఆఁగు-ఇత్యాది గకారములయున్న అర్థ

బిందువు గలదా లేదా యను సంశయమును, 'గ' కారము, 'వ' కారమైనచో లేదు. గాకున్న నున్నట్లూహింపవలయు. మూగుశబ్దము మూపు అనురూపమును బెంచు చున్నది. చూడుండు కుమారసంభవములో ౪౭౦వ పద్యములో శబ్దాలంకారము. మఱియు శాసనములలో 'నాండు' అనియే యున్నది. కావునఁ బూర్వకాలమున దీర్ఘముమీఁద నెఱసున్నయే వాడినట్లు లోచుచున్నది. నాడు శబ్దమున 'ఆనాడు, నేడు, ఎన్నడు' అను నర్థమున మాత్రమే యర్ధానుస్వారము గలదు. 'నాడు' దిన మనునప్పుడు లేదు. 'రెండవనాడు' అనునప్పుడు లేదు. ద్రవిడభాషలో అంద్రి, ఇంద్రి, ఏంద్రు, ఆనినాఁడు, నేఁడు, ఎన్నఁడు అనియు, రెండు నాళ్ అని రెండునాడులు అనియు వేఱువేఱు పదములు గలవు. కావున నుద్యోగ పర్వములోఁ దిక్కన సంకరముచేసినవాఁడు కాఁడు. 'క్రౌంచపద, సరసిజ, గర్భబంధ కవితల లక్షణములలోఁ దప్పులుచెప్పిన యప్పకవ్యాదుల లక్షణ సూత్రములు ప్రామాణికములుగా గ్రహించుట దోషము. ఇప్పుడు ప్రాచీన నవీన కావ్యములు చేరితోనున్నవి. వానులు చూడఁదగును. నన్నెచోడుడు, ఏనియను శబ్దమును నేనియని నకారాదిగాఁగూడఁ బ్రయోగించెను. కాబట్టియే నన్నయభట్టు—న్నేని...విగ్రహణీరపించుయు, ఆవి-ఆ-ఉ. అను నకారాదిగాఁ బ్రయోగించె. ఇది తెలియక లాక్షణికులు దుస్సంధియు, యతికి వైకల్పిక భావమును నన్నయభట్టున కారోపించిరి. చోపిన శబ్దప్రయోగములు పరమ ప్రామాణికములై కవిత్రయ పెద్దన సోమన తెరవ మంచనాదుల ప్రయోగము లకు సరిపోవుచున్నది.

## ఉత్తరకథాప్రశంస

అష్టమాశ్వాసమునఁ బార్వతీ వర్ణనమును, శివుని ప్రస్థానమును, గౌరశ్రీ దర్శనమును, బ్రహ్మముల వర్ణనమును, సాయంకాల వర్ణనమును, తమోవిజృంభణమును, చంద్రోదయ వర్ణనంబును, ఏటాభిసారికా వర్ణనంబు, లంజికాప్రసాధనంబును, పాంచాలాది వివర్ణనంబును, సూర్యోదయంబును, వివాహయత్నంబును; నవమాశ్వాసమున శివపార్వతీ ప్రసాధనంబును, వివాహంబును, ఉద్యానవనవిహారంబును, జలక్రీడయును, కైలాస నిర్గమంబును, రతిక్రీడా విహారంబును; దశమాశ్వాసమున నగ్ని దేవతల ప్రేరణంబున వచ్చి శంభు వీర్యధరుండగుటయు, గంగ కొనంబోవుటయు, గంగాదేవి వల దనుటయు, శర

వణసరోవరంబు వడియుటయు, సప్తర్షి పత్నీదర్శనంబును, నరుంధతి వరిధానము ధరించుటయు, తక్కిన యాఱ్వురు నిరంబరలై యగ్నిచే నాలింగితలగుటయు, సద్యోగర్భము దాల్చుటయు, గర్భవిచ్ఛేదము నేసి కమలపత్రంబులం దిడి గృహమునకుం జని శప్తలై జ్యోతిర్లోకంబు నెందుట, కమలపత్రంబునఁ గుమారుం డుదయించుటయు, నారదాగమనంబును, ఇంద్రసందేశమును, ఐరావత కుమారయుద్ధంబును, ఇంద్రధావనంబును, శివదర్శనంబును, పార్వతి వాత్సల్యంబును, కుమారుని సేనాపతిత్వంబును; ఏకాదశాశ్వాసమున తారకునకు దూతం బుమ్పుటయుఁ బ్రాతిదూత్యంబును, యుద్ధ సన్నాహంబును, వీరపత్నీ ప్రవాస దుఃఖంబును, దివసద్వయ యుద్ధంబును; ద్వాదశాశ్వాసమ్మున తృతీయ దివసయుద్ధమ్మున తారక మరణంబును, దివ్యాంగనా శేషాక్షతా వర్షణంబును, గ్రంథకర్తృ కవితోద్దేశమును వర్ణింపఁ బడినవి.

దీనిలో నాశ్వాసాద్యంత పద్యములలోఁ గృతిపతియగు మల్లికార్జునకును శివునకు నభేదము సేయఁబడినది. ఈ మర్యాద కర్ణాటభాషలో పంప భారతము లోను గదాయుద్ధము నందును గూడఁగలదు. గ్రంథాంతమునను ''సరసాహారము రాగ హేతువను టజ్ఞానంబు పారావతో। త్కరముల్ చిక్కనిరాలు మ్రింగియు సదాకామార్తులై యుండుఁగే। నరి సాంద్రామిషభుక్తియైనను సకృత్సంభోగ మంపన్ మనో। హరసుజ్ఞానము కాక రాగరస మం దాహారనిర్వృత్తియే.

సీ॥ బుద్ధీంద్రియంబుల పొలఁతులనాఁ జాలు
 కర్మేంద్రియంబుల గర్వమడఁచి
విషయాలి నదపాతుపేటికలనఁ జాలు
 బుద్ధీంద్రియంబుల పొంకమడఁచి
యంతఃకరణతతి నాటపట్టనఁ జాలు
 విషయ సమూహంబు పీకుడఁచి
యాజవంజవమున కనుచారియై పర్వు
 నంతఃకరణతతి నలవుమడచి

సుమచిరస్థూలముల్ బాహ్యకరణసమితి
సూక్ష్మమంతః కరణతఁ జొచ్చికూడు
నాత్మ నాత్మైకదృష్టి సర్వాత్మఁ బరమ
పదనిశివు గాంచుట పరమపదవి సుమ్ము'' అనిచెప్పి,

సీ॥ "జ్ఞాన దీపంబు హృత్సదనమ్ములోఁ దాన
దీవియగానెంతదివురువారు
వలచేత నసమశివలింగంబు నవరత్న
పతకంబుగా నిడవలచువారు
భారతిఁ దమ మోముఁ బసిఁడి మేడుపులోన
నిలువెల్పుగానిల్పఁ దలఁచువారు
సకలమాదిగుణమణీహారమ్ము లురమున
హారమ్ముగానిడఁ గోరువారు

వెలయమత్కృతిఁ జదువుఁడు వినుఁడు వ్రాయుఁ
డీశ్వరాంబికాగుహు లిత్తురీప్సితములు
వారిమేమెయిఁ గొనియాడువారు కోర్కె
లొనర జంగమ మల్లికార్జునుఁడనౌనఁగు" అనియు వ్రాసియున్నాఁడు.

దీనికంటెను మనోహరమైనకావ్యము పెద్దనప్రద్యుమ్న చరిత్రము, చిమ్మపూఁడి యమరేశ్వరుని విక్రమసేనము నాచనసోముని కవిత కీడురాదు. పెమ్మన యనిరుద్ధచరిత్రము భావ గాంభీర్యము పదపుష్టియుఁగలదై యతి రమ్యముగానున్నది. ఈ మూఁటిలో భాగములు మాత్రమే లభించినందున నాంధ్రభాషాభిమాను లెవ్వరేని నాకుఁ బత్యాకృతులు పంపిన వాని ముద్రించి మాసిపోవుచున్న తత్కవుల కీర్తిచంద్రిక యుల్లసిల్లునట్లు చేసెదను.

ఈ గ్రంథమును సంపాదించి ప్రచురించుటకై నా చేసిన దేహధన వ్యయములును మిక్కిలియయ్యె. గార్హ్యాంతర ప్రసక్తుంత నగు నాకు నవకాశము లేమింజేసి గ్రంథశోధనము చక్కఁగాఁజేయక కొన్నిప్రమాదములు విడచితిని. ప్రాచీనపదములలోఁ గూడ నెక్కువ జ్ఞానములేమిచేఁ గొన్నియెడలు సందిగ్ధములుగా నుండును. పాండిత్యము చాలక యిట్టిపనికిఁ బూనినందునకు నన్ను నిందింపక నాసదుద్దేశమును మాత్రమే గ్రహించి నాయందు మిత్రభావము ప్రకటింతురని యీకృతిఁజదువు వారినెల్లరను మిక్కిలి విధేయతతోఁ బ్రార్థించుచున్నాఁడను.

వనపర్తి—
డిసెంబరు ౨౮ తేది-౧౯౨౦ } మా-రామకృష్ణకవి.

# ప్రథమభాగము—అనుబంధము

ఇంపుతో సంఖ్య గ్రంథమునందలి పద్య సంఖ్యను దెలుపును.

9. ఇందు ప్రాసమున దీర్ఘముమీఁది యరసున్న నెఱసున్నగా వాడఁబడినది. ఈ విషయమై పీఠికలోఁ జూడుఁడు. విష్ణువు మహేశ్వరుని వామాంగమునందు బాణించెనని చోళుఁడన్నను మఱియొక కవి దక్షిణాంగమని చెప్పుచున్నాఁడు. 'బంట్లున్న పాలెంబ బలువిల్లుగాఁజేసి నవమణివలయంబు నారిఁజేసి। నుమపనెన్నడిమి కన్నును ముల్కిగాఁ జేసి దక్షిణాంగంబ యస్త్రమ్ముజేసి' అని పేరయ మల్లికార్జున శతకము. బొడ్డపాటి కొండయ తన కాళహస్తి శతకములో వామాంగమనియే చెప్పెను. 'ఊర్పులశ్వంబులై యొప్పారుచుండంగ దారయుపల్లెరమ సూతుండుగాఁగ। సవ్యాంగమతిఘోర సాయకంబడిగాఁగ నొరిదిఁగుంతలము మైజోడుగాఁగ' 6. అనయము = మిక్కిలి 9. స్థాణువు = మొదుసు. అపర్ణా = ఆకులులేనిది. విశాఖ = కొమ్మలులేని. 11. ఎలయు = ప్రసన్నముగు. 12. సద్యము = అప్పుడ. 'సద్యంబ బ్రహ్మహత్యావద్యము' భార-స్వ. 17. వాల్మీకున్ — 'వాల్మీకిశ్చాపి వాల్మీకోవలటాపరటాతథా' ద్విరూపకోశము. 22. మహాకవిబాణుని కరములు తునుమంబడి శివప్రసాదముచేఁ గ్రమ్మఱలభించినట్లు కవిస్తోత్రముల వలనఁ దెలియుచున్నదిగాని యెంతవఱకు నిజమో తెలియదు. బాణాసురుని విషయముగా నప్రస్తుతశ్లేషమున గ్రహించినచో సరసముగానుండును. 'గద్యంబు చెప్పి శంకరునిచేఁ గరములు ప్రతిభతోఁ బడిసిన బాణుఁదలఁచి। హరునివినుతులచే బాసలాడఁజేసినట్టి భట్టుని నన్నయ భట్టుఁ బొగడి' అమరేశ్వరుని విక్రమసేనము.

21. ఉద్భటుఁడు కుమారసంభవము, కావ్యాలంకార సారసంగ్రహము, హరలీలయుఁజెప్పినవాఁడు. కాశ్మీరజయాపీడుని సంస్థానమున నుండెనవాడు. 35. ప్రాణములు = దశప్రాణములు. 36. మేలిల్లు = శ్రేష్ఠము పదమున్న (ధాతుపదము) 38. గ్రుడ్డివాఁడు లావుకపక్షినిఁ ద్రొక్కినట్లు = ఘుణాక్షర న్యాయముగ. పోల్చిచూడుఁడు 'జీయెనె బల్లవర్ నెఱయె సత్కృలివేకదెపేశ్ ఘుణాక్షర। ప్రాయదెశబ్దమొందెదదు మత్తెవిచారిసినోడె కాకతాళీయదె వాక్యమొందె

రను కూడె నిపుణ్ణి వా దంభలాప్రక। న్యాయడె భావ మొంచెరకులేసెనె పేర్మిఁదిర్పు దొప్పమే' చంద్రప్రభ పురాణం-ఆ-౧-౮౮. 40. పోల్చి చూచుఁడు. 'పదలాలిత్యము వర్ణసిద్ధియును శబ్దస్థైర్యమున్ మంగళా। స్పద భావంబును రాజ యోగ్యతయు దోషస్ఫూర్తి రాహిత్యమున్। సదలంకార విశేషముం గలిగి విశ్వప్రాణ సౌభాగ్యసం। పదమై నేఁడుఁబోల్రితాల పంచాపద్యంబు హృద్య స్థితిన్' అని కవిలోక బ్రహ్మ.

72. మైకొన్న = ఇష్టపడిన మొదం. 74. జీవితేశ్వరుఁడు = యముఁడు. అపోవక = తనివిలేక. 82. ఉలివి = మ్రోఁత. ఆలించి విని = ఆదరించి విని. ('అక్కొమ్మమధురోక్తి లాలించి యెన్నఁడు పీనుల విన సంభవించునొకొ' ఉద-ఆ-౧-౧౬౧). 89. వెల్చన్ = తెల్లనగునట్లు. 90. సోలంబునన్ = మత్తుతో. 92. పులుగులు = పక్షులు. 94. ముసుమిడి = పదునగా. 95. సావి = యని. 98. కడిపోవ = చెడ్డవాసన పోవునట్లు. కాతరిల్లి = ఉత్సహించి. 'బగె సంభోగసుఖక్కై కాతరిసి కణ్గళ్ కీరి సర్వాంగమం తెగ వాలెంగిసె' పంపరామా-౯-౫౬. 102 కన్నెచింగి = జాచవెలిసి. 105 ఒకమెయి = కామరూపశక్తి లేని యొక దేహముతో. 126 గో = కిరణముల. 160 కన గోల = కళ. కోల = బాణము. గరి = ఈక. (విష్ణువు బాణమై యగ్ని బాణాగ్రముగాఁ ద్రిపురవిజయమునఁ బరిణమించినందునను, 'వింటి క్రిందటికొమ్ము వెకలించి పెటికిన భూకాంతయును నాభి పొలుపు మిగిలె। నమ్ము పుప్పుకొనిన నమితతరంగముల్ పాలసంద్రంబునఁ బ్రక్కరిల్లెఁబంపుకంటులు రెండు సంక్లిగిలించినఁ గలువలుఁ దామరల్ సెలిమిసేసె। వాజుంఁ గొనివచ్చి వరరథం బునఁ బూన్పఁ జిచ్చుకు నాకలిచిచ్చు పుట్టె। నారి సంధింపఁ గశ్యపనారి వడఁకెఁ। గోల సంధింప లచ్చికి గోలవుట్టె। విల్లు దెగఁదాపెఁ బురములు వ్రెళ్ళనేసి। తరిదివిలుకాఁడ వౌదువ శరభలింగ' అని పాలకుర్తి సోమేశ్వరుఁడు 'నుదుటి నెన్నడిమికన్నును ముల్కిగాఁ జేసి దక్షిణాంగంబు యస్త్రముగఁ జేసి.' 'గరితోడఁ గూడ నాకసపు సూదికె లాగు నెమ్మేనఁ బడ నిమ్పునమ్ము దాపిగి' పేరయమల్లికార్జున శతకములోని చిన్నపద్య పాదములు.

163 అన్నిన = పుచించిన. 164 పరవిడి = వాచాటుఁడు. రొంకి = దిగి. తుత్తుబుగొని = గొంతు కట్టుకొని. 188 ఎత్తు = దంచెత్తు. 189 విగు

ర్పించి = భయము చూపి. 'వారిధిమేరెదప్పి కవిసంతు విగుర్పించిరా దశాననం' సంపరామా-౫-౧౮౬. 194 తంపు = ఆవశ్యకము. 198 చీకటి—అర సున్న లేకుండుటకు 'సీకరంబులు ద్రోవక చీకటించును' భార-అను-ఆ-౪. 'నా కూతుంబొఱుంగు విసము నృపా కడుచిడ...నాతం। జేకతము—।చీకటి నొకనాఁడు దెచ్చి చెచ్చెర నిచ్చెన్' దశ-ఆ-౬-౯౯. 207 తేహాఁగు = ఉపాయము.

210 కవి = ఆక్రమణము. 212 పంచల = వృత్తి 'పందలెమోని దోర ణద సింపపరం పొసఘాను ఘాసకూసుంపరె' అర్థ నేమిపురాణము, 'నత్తిగెగగ్గ రంకరుళ బక్కాళె మంటప కణ్ణత్తెసరం। సుత్తిద పాళయుక్కి వియసూంటుగె పంద లెయొందు' గుణవర్మని సూక్తికము. యెత్తిరి = పేయుచుంచిరి. 219 కావ డించి = క్రొప్పలునట్టు. 221 కడిసన్న = వాసనపోయిన. 229 కానువు = కానుగు.

234. చరులు = చప్పటలు. గెత్తుచు = ఊఁగుచు. 235. అపూర్వ పదములకుఁ బ్రయోగంబులు మృగ్యంబులు. 247 శివహిమవంతులకు శ్లేష. 251 కీడు = తక్కువ. 253 పఱ్ఱొటి = ప్రవాహము. 259 పుటరు = లక్ష్యము సేయుట. 'ఉటడు సురేంద్రునైన.' భార. ఆది. రేయెండ = బాలాతపము. 'కటి వచ్చపట్టు దిగ్దంతి కుంభస్థలి చూపట్టు రేయెండ జోడు జోడు' ఉ-హరి-ఆ-౪. 268 తార = వెండి. 281 అంకమాలిక = నామాంకితస్తుతులు. "ఇనియనమేలె మెల్లనమలంగి మనంగొళె భంగియిందె నం। జనితవికార మొప్పె నిజసౌష్ఠవమొందిరె బీగి పీవర। స్తనయుగమధ్యదొళ్ కరమొడంబడె జీవెయనుణ్బు ఫలమే। లెనిసె పషూటి పాడిమెఱచళ్ నయదిం బ్రియనంక మాలెయం" కవికాముని శృంగార రత్నాకరం. ఆ. ౧ ౪౨. పత్రచ్ఛేదము = కలావిశేషము. 283 మలఁపగ = పుష్పింప. 297 రాజశేఖరుని పూర్ణచాటువు = "కర్ణాటీ దశనాంకితః స్మితమహారాష్ట్రీ కటాక్షాహతః ప్రౌఢాంధ్రీ స్తనపీడితః ప్రణయినీ భ్రూభంగవిత్రాసితః లాటీ బాహువివేష్టితశ్చ మలయస్త్రీతర్జనీతర్జితః సోయం సంప్రతి రాజశేఖరకవిర్వారాణసీం వాంఛతి". 305. తొప్ప = ఎఱ్ఱనైన. "తొప్పవాతెఱ" వీధి. ౨౦౩. 315. తిరులు = వెఱ్ఱి. 319. సురంగము = ఒప్పిదము. 320 ముంచితెచ్చి = అంతయుఁదెచ్చి. "ఇంచుకరావళి ముంచి తెచ్చి" కేయూ-ఆ-౪. ౩౪. 345. వరువు = దాస్యవు. 351 పసిగొని =

ఆఁకలిగొని. ఏఁగిలింపకుండ = జేకులు విప్పకుండ. ఎరలి = ఆలింగనోష్ణ భావమును బొంది. 359 అనయము = మిక్కిలి. 361 అబ్బగించు = ఓర్చు. 371 వలువలు = నిరంకుశుఁ డగు. అబ్జుఁడు = చంద్రుఁడు. మొగపెట్టు = ఎదిరించు 372 ఓఁగులవాఁడు = యుద్ధమునఁ బాఱువానికి శిక్షఁబుచ్చి తక్కిన వారి నెదుటఁగొంపోయి భంగము చూపుట. 373 అర్క = జిల్లేడు. 374. వెలిలోఁపు = అంతర్బహిస్సులు = న్యాయాన్యాయములు. 375 ఈవవిడుచు = కాపాడక విడుచు. 379 బంతఁగి = దీమము. త్రోచి = అవ్వలఁ దఱిమి. 381 ఒరయుగడ = Competition. 382 దీర్ఘనిద్ర = చావు. 383 ఆర = అంగారకుఁడు. మంద = శని. 384 అనిమిష = చేఁపలు. భీమ అరుతము. కనక = ఉమ్మెత. శివ = నక్క. 386 శుక్లశోణితము రెంటికిని వీర్య మనఁజను. 392. విరలి = విరాళి. 394 అప్సరస = ఆకారాంతము గూడఁ గలదు. 396 ఎచ్చి = పొగడి. 398 తిరులు = వెట్టి. 399 వేల = దాస్యము. కలుచు = ప్రేమించు. 400 అగ్గలము = మించినవారు. 401 తన్ను = నన్ను. ఇట్టిప్రయోగములు ప్రాచీనకవులలోఁ గలవు. "ఒలసి మాముందఱ నొక పైఁడి మృగము। వొలయుటయును జూచి భూనాథుఁజూచి దాని నేగతినైనఁ దనకుఁ దెమ్మనినఁ బూని రాముఁడువోయె...నా ర్తరవంబు శూలమై నాచెవిఁ జొచ్చి నాటుటయు" రంగ-ఆరణ్య. "చెప్పకున్న నీవు జీవంబు విడుతువు చెప్పినపుడు తనకు జీవహాని। చెప్పి మున్న నీకు జీవంబు విడిచెద। నీవు చన్నవిదప నిలువ లేను", "అక్కన్యఁదెచ్చి। పెండ్లిసేయుము తన్ను నభీష్టమిదియ। యనిన నగుఁగాక యనుచు ధరాధిపుండు" కవిభల్లటుని భేతాళపంచవింశతి.

411 వార్చుచు = ఎదురు సూచుచు. 414. కుసుకుసుకొను = అస్ఫుట వాక్కు లాడుచు. 415 కండవడము = తెఱ. "కండవడం తెరసీరెనీర్జలం" కబ్బిగరకై పిడి. "తళిర్గళకండవడంగళ। తళిర్గళపానుగళె తళిర్గళోవరిగళెకెం దళిర్గళె ళసిపెళవిజిల్గళె। విలాసనుంమె తెద రల్లికెల రబలెయరొళ్'' ఆది పురాణం. ఆ-౧౧. ౭౯. కదువటిల్లు = వడఁకు. 416 ఉదరిపడి = ఉలికిపడి. తెంక = సందేహము. నోటికండ = భయము. 418 సహానికాఁడు = ఉద్యోగి. పోఁటరిమూఁట = పొడుచుటలో నేర్పరి. ఎల్లిదుండు = హేళితుండు, 426 బూటగొంగ = విటుఁడు. 432 అలఁతి = మితి = శక్తి. 436 కొసరు = మఱి మఱిఁ బ్రార్థించు.

443 ఆరము = ఆరామము. 'పున్నఁ దెంచేఁగి యేమునునోఁ కన్నె దొంకపిల్ రెండుగా విరిచివైతు। వయసత్తై సమసవిల్కాల నాయకలమున్నవిడిచి యాగ్యములతో వెదలనసుతు। మదనుని బ్రమోదముదమ్మెదలఁ జంపకలతాంత ములలో మదుగంగఁ పతిమివైతుఁ దగులమై పీతెంచు దక్షిణాగంధవహు మహోకీర్ణప్రసవాతఁ బ్రోతు। నేవిటులెదు నాయుష్టిపోటి దలుగ। వెలఁది నీమనిత్రోవల వెడవరుంతు। మున్మ ధైర్యంబు వదలకు మున్మ యెంచుఁ। గత్తలము గల్గమేనిఁ గంటె బాధ' విక్రమసేనము, ఆ-౨. 445 తీగశబ్దమున నమస్కరించు. 'తీగ యమున్మెంతెక్కి...వాసు...వు। న్నాగ...భోగ' భార-ఆది. (ఇంచునాగు = ఎగురు) సుమసపాటలు = పుష్పావచయగీతములు. 453 గొనపరి = పిల్ప.

455 పోల్చి చూడుఁడు:- "అచితని నీయముల్ నుదుటపాపలు పచ్చలు తేఁటగుబ్బ కెం। పులు టకరాజి వజ్రములయుల్ కళికావళు లాఁడిము త్తియం బులుగఁ బొసంగు చంగజునిపొక్కన మెల్లను నాక్మలోననిం। పులుపొదలించె రాజునకుఁ బూచినపంగడు పొన్నలున్నలిన్." సూరనయుమయనోదయము-ఆ-౧-౧౩౪. 457 పలఁకు = తెల్లవాలు. 468 సర్వతః ప్రాసకీనము. 469 నంచు = నగము కొటికి చప్పరించెడు. 471 అలికె = చల్లి. 482 తరమైన = అనుకూల మగు. ఈఁగటపోడు = కొట్టుకొను. 493 గడికె = ముణుఁగునకు. 502 కాపువచ్చు = పిలుపున వచ్చునట్లు. "భీషణమచుల్ నాజ్వలత్ప్రమానంబుగా। జ్యోతిర్లోకము గాఁపువచ్చెనొకొనాకోభిల్లు" కుమా. ఆ-౧౦. "వారిధిశయనుఁ జేయూరఁబూజింపని ఖలుఁగట్టి పెడకేలుగట్టి తెందు। హరిమందిరమున కధీశుఁడై నడవని హీనాత్ముఁ గాల్పట్టి యీడ్చి తెంచు। పలపమ భయంబు వా రెంత వారలైన। నట్టివారలు మన కగ్గ మైనవారు। నాదు నిరయంబునకుఁ గాఁపువచ్చు వార। లనుచు బుద్ధిగఁ జెప్పె మార్తాండసుతుఁడు" పులుసుమారుతమునింగన్న కవులక్షణము. 508 వక్కగొన = పూరేకులు మొనలు ముడుచుకొనునట్లు. "వక్క వాసినపూవు పసుపతోఁ కెరలాడి యింకముఁ బూఁబానుపు లలవరించు" ప్రద్యుమ్న . ఆ-౧. 509 తలకన్ = సిగచెడరెపదు. 513 నానావిధదృష్టులకు లక్షణము చూడుఁడు భారతీయము. అష్టమాధ్యాయము, దృష్టివిశేషములకును 'వర్వి' మొదలగు క్రియా పదములకును గ్రమాలంకారము. 515 పోల్చి చూడుఁడు. 'బొమలెక్కించుచు విల్లుసంచు నునుఁజూపుల్ చంచలాచంచలక్రమ

రేఖ న్నిగిడించు జాతవిభాషణంబుల్ మెఱుఁగించు నెయ్యమునన్ బల్కఁగ నల్కమీఁది చటులంత్యాఘోషముం జేయు నయ్యుడు ప్రాపించి రతీశ్వరుండు హరు చిట్టోపించ నుద్యోగముచున్, పొందు. ఆ-౧. 517 పేర్పంపులు = చెమట బిందువులు. 520 ఒత్తలించు = సమీపింపఁజూచు, 'గజయాన మెలఁగిన గతి యైనఁ బైఁబడ గద్దించి తర్కించి కలఁకనొందు। మానిని యల్గిన మాడ్కిఁ దోఁచిన చేర్ప నూకించి భావించి యొత్తరించుఁ॥ కమలాక్షినెమ్మోవి చవిగొన్న యట్లైనఁ జెమరించి చర్చించి చిన్నఁబోవు। మదవతికౌఁగిలి గవిసినయట్లైనఁ బులకించి తేలి సంచలతనొందుఁ॥ దన్ను జెలఁగినకోర్కులు తగులుగొలుపు। నోలిఁ దనలోన నలినదళాలసుఁడు। మానసమూఁకాడ గంభీరమహిమ సడల। లజ్జ గడివోవ ధైర్యంబు లావుదిగఁగ" ప్రద్యుమ్నచరిత్ర-ఆ-౪. "విరుల నూఁకించు చన్గవబిరుసుదనము। వలలు రేఁగుకాంతికి వన్నెవెట్టి। రసికరమణి జనానురాగములతోడ నిగిడె యౌవనంబు వనమున నివ్వటిల్లె" పెమ్మన-అనిరుద్ధ చరిత్రము-ఆ-౨-సీసమునెత్తుగీతి. 524 కాయ్వు = స్థాయిభావరసాతిరేకము 526 ఇంద్రుఁడును మన్మథుఁడును నల్లనివారు. "రామచంద్రుఁడు నల్లు సామజం బతినల్లు రతివల్లభుఁడు నల్లు రాత్రినల్లు" చాటువు. 540 ఎడ = అవకాశము. 542 ఒరయ = పరీక్షింప. 544 రాపుపఱచి = అదనిపాలు చేసి. 549 మసమసు = ఎండిపోవు. పెరిగిన = తెగిన. 550 అపలంకి = వ్యసనము. 552 విసుమర = వియోగము. 553. వినుతలిబేటము = శ్రవణానురాగము. 555 తప్పఁజూచునో = దయమాలి చూచునో. 561 మేలిల్లు = శ్రేష్ఠమగుచున్న (క్రియాపదము). 562 సంబెరము = సముచ్ఛావవిక్రుపులకు మనస్సునఁ గాపున్నముకలిగి ఉల్లాసభావము పెంపుట. 565 వావిరి = వనవి. బిందము = ఛేదబద్ధతప్పవము. 568 ఉత్కండించు = నిట్టూర్పు విడుచు. 569 నలువలేమ = నలువఁజాలినయంత సౌకుమార్యము గలది. 571 అగ్గడి = సిగ్గులేని. 572 చిక్కనిపెంపము = గట్టిమనసు. ఆసగడు = పోవుట. 576 పోలదు = ఒప్పదు. 580 పొరిమాల = రూపు నశించునట్లు. 583 ఎచ్చిచ్చి = తెప్పించి. 584 దృష్టి మరణములను నవస్థలు చక్కఁబక్కినవశావస్థలిందురోఁ క్రమముగా వర్ణింపఁబడినవి. 585 ఉచ్చుకించు = ఎత్తివేసెను. పరవారులు = ధారాగృహములో యంత్రములనుండు కాఱుచున్న ధారలు. 589 భాసజహరుల పరస్పర విరోధము నకుఁ దగిన సాత్త్వికవికారములు వర్ణింపఁబడెను. 591 అబ్బగింపక = ఓర్వలేక. 594 కొనుకు = శిరోభూషణము. 597 ముక్త్వాగతము = చిత్రశాస్త్రమున

రేఖలు వ్రాయు పంచమార్గములలో నొకటి—తక్కినవి:— అర్ధఋజువు, సాచి, ద్వ్యర్ధాక్షి, పార్శ్వాగతము. చిత్రపటరూపములు మనకుఁ జూచుదృష్టిభేదములఁ జూపురేఖలే యీయైదును. పోల్చిచూడుఁడు "కిరి ఋజ్వాగతవింద మర్ధఋజువింపం కోకిలం సాచియుం। కలహంసీకలభం రథాంగమిథునం ద్వ్యర్ధాక్షియుం బర్హిణం। బలి పార్శ్వాగతమిం దదేంపడెదవో పంచాంతకవ్యక్తిక। గ్గొాశై కందర్పనబాణపంచకదవోల్ చిత్తక్రతిశోభము" అని మల్లినాథపురాణములోని చిత్రపటవర్ణనము. పత్రక, బిందుక, నిమ్నోన్నత, మాన, నీలక, ధూమ్రావర్తక, ఉద్వర్తన, చిత్రప్రవర్తనము లను నెనిమిదియు క్రమముగా సకల, స్వస్తిక, సర్వతోభద్ర, కరిక, కంటక, త్రిభంగ, శిరనివేశన, వర్ధమానములను నెనిమిది విధములగు చిత్రరూపములను లేఖనమార్గములు. వన్నియ = వర్ణము. కంబెబ = గవిసెన, కప్పుపావడ. 600 మెయి = రీతి. చలిమిరి = శైత్యము. గిర్మొడు = అపహరించు. 601. అనుటు = అగుట. కలపికొని = చేర్చికొని. "బాలచంద్రికం గలపికొని తక్కటిజెయుం బంచించి" మల. ఆ ౩. 605 కప్పెపల్కు = మఱుఁగుసేయు. బయల్పడ = స్పష్టముగునట్లు. 606 వలరసము = అనురాగము. కుక్కడము = తొలుకునట్లునిండుట. 611 లగ్గజెగ్గిల్లి = "లగ్గ జెగ్గిలించు నగ్గలముగ" భార—విరా—ఆ—౨. 613 అరుణ = కెంపు; సూర్యుఁడు. చేతరింప = ప్రసన్నుడైనను గలుగ నమృతమున కిట్టి గుణము గలుగకదా. వలను = యుక్తిమార్గము. 616 తోయజాములు = కలువకాఁడలు. 618 గంటులు = వేళ్ళు. ముకువు = గిల్లుము, కొలపేటలు = పట్టిపేళ్ళు. "తరుణీయ రావిలాసకుసుమాస్త్రనిక్షిప్తె తాపతాపమిం। తరుణమృణాళమం తెగెను పూగొళదిం పొఱగిక్కిదంపమిం। కొరగిమృణాళనాళికెగెదంపన దక్కెగె తబ్బుకొగ్గితః ఇరగడ సూనుమిగ్గె కొలపేర్ గొనలం గుణియాగె మాడువర్" మల్లి. ఆ—౩. ౨౮. వడిపెట్టు = నిండ వడియునట్లు పెట్టుము. 624 వాసించి = వాసనలు కూర్చి. "సిహారజలముల నెంబారుకుంభలు శిశిరగంధముల వాసించువారు" దశ—ఆ౩—౧౨౪. వాటి = పోఁగొట్టి. ఎంబి = ఒత్తి. 627 పాటించి = మృదుత్వమున కనుకూలముగాఁగూర్చి: "పూవుసెజ్జలను లేఁబొఱలవీచోపులు వెరవుపాటించి గావించువారు" దశ—ఆ—౩. 628 చలిదు = శైత్యము. 634 వఱువట్టు = మిక్కిలిమెండి దాహము గలుగుట. కొలగొను = చంపు. వగలు = మంటలు, కోరికలు. 638 రేకల = రాత్రిప్రారంభమున. "కాలము తలఁజేరు" కేయూ. ఆ—౩. పక్షు = విసురు. 641 కని = తీట. విడిగొల్చి =

విప్పి. తని = చల్లని, అఱమి = గొంతురాపఱి. ఎలనుగ్గు = సన్నపొడి. 662 ఇడుగడ = ఆపద. 670 దేహమును దవనపుఁబొరకుఁ బోల్చుటకు, "పరిణత ఫణిలతాపత్రంబు గడిసినచిపుసనాఁ జెక్కుఁ జేయిచేర్చి। దవనంబుపొరకలఁ గవిసినమంచునాఁ బలుచనిచెమట మైఁ గలసి మెఱయఁ। గలువరేకులు మౌక్తికముల సీనెడిని నాఁ గన్నుల బాష్పంబుకణము లురుల...యేకతం బున్నదాని రాజేంద్రతనయఁ గనిరి లతికాగృహంబులో వనజముఖులు" అమరేశ్వరువిక్రమసేనము. నెలకన్ను = చంద్రదర్శనము. 672 ఆలవు = శ్రీవి. 674 వేల = దాస్యము. సంబవులు = కప్పములు. గోలికొలిపి = వెట్టిఁజేసి. 676 వెందు = తమవశమునకుఁ దెచ్చుటకై భ్రమరములు మధ్యనుంచిపాడెడుపురుగు. 682 ఘోషావతి = పార్వతివీణకుఁ బేరు. 684 కూర్చుగుమ్మలు = ప్రియమైన చెలిమికత్తెలు. 687 అలఁతికి = మితికి. పొదివెంచు = ప్రతిపెచ్చు. మరపించి = స్నేహముచే మరిగియుండునట్లుచేసి. అనఁగి = కలసి. అఱఁగ = పోవునట్లు. విడిచెదేని = విడిచినను విడుతుపుగాక. 692 వేరువెల్లంకి = వేళ్ళగడ్డలు. "వేరువెల్లఁకి గాయగూర సంపన్నోర కువరాగ్నిగాడ్పుచే నుజ్జగించి" పాండు. ఆ-౨-౨౫. "అడవిలో వెల్వలనై వేరువెల్లంకి త్రవ్వి తాఁదినెడు భూదారపపని" అనర్ఘ—ఆ. ౧. 694 పోల్చిచూడుఁడు:— ఉత్తరహరివంశము—ఆ-౨-౧౨౨వ పద్యము. 701కాఁదపూవులు = వనపుష్పవిశేషము.ఇది వర్షర్తువునఁ బుష్పించును."ముగిలిదిరేతె కాదలలరేతె" జగన్నాథవిజయము. 702అన్ని = మదించి. గౌఁడుగీతములు = కల్లు దింపెడివారి పాటలు. 704 గోలము = కుదురులు. గౌరుకొమ్ము = ఏనుఁగుకొమ్ముతోఁ జేసినవి. 704 మల్లికార్జునుఁడు-కృతిపతి శివున కభేదముగాఁజెప్పఁబడినది. 707 వెంచ = సరస్సు. "వికచ సరసీరుహం కోకకులవ్యాభాసి పూగోళం తానిరెయుం బకనికరలులితకలుషోదక విడిళదొళంచె వెంచెమొళ్ వసియిసుమే" గుణవర్మ శూద్రకము. 709 వలి = గుండ్రపు 741. తొప్ప = ఎట్టినగు. (తొప్పవాతెఱయునుదొ్రటుపాటు. నిర్వ—ఆ—౮.) 803 ఎయిద = సమీపింపఁజేయ. 803 అగ్నిసహియగు రస మష్టలోహములను వేధించును.

రసముశుద్ధిచేసి హేమవజ్రాదిసత్త్వ ద్రుతులలో రసజారణము నేసి ఘూమవేధిశబ్దవేధియగు రసముగాఁజేసి సారణనియతితప్పక యేలోహములలో వేధించినను హేమమగును. ఈ యంశములకుఁ జూడుఁడు రసరత్నాకరము

పాదఘంటసము, రసార్ణవము, మంథానభైరవకల్పము, ఖండకాపాలికతంత్రము, రససారము, స్థిరరసమంజరి, కల్యాణకారకము మొదలగు రసశాస్త్రములు. 804 సారి = చక్రము. 806 అరగొను = సందేహించు. అలికిరి = చల్లిరి. 812 ఉప్పరి = ఉప్పుగా పంతలివడి. 819 దెచ్చుడు = తెచ్చుట, నానోడి = చెప్పుటభయంపడి. కన్ను = జాడ. 821 కాన్కి = చూపు. కావుడు = అగుట. 825 పోలుపొందు = కుదురియుండునట్లు. 838 తొడుప = తొడిగింప. త్రేణి = మినమినలాడుట. ఊదవిడుచు = ఊరకవిడుచు. 844 ఈ పద్యార్థము కాళిదాసు కుమారసంభవములోనుండి గ్రహింపబడినది. 846 తగిలించి = ప్రేమింపజేసి. సౌబగుడు = సుభగుడు. "సౌబగులునీమగలేవుడ" భార-ఆర. 850 కుదురు = ఆలవాలము. నబము = వికటవు. 855 అష్టమూర్తులు శివునకుగలవు గదా. 856 తక్కనేలిన = తానేపాలించిన. అపదార్థుడు = వస్తురూపములేని వాడు, అవాచ్యుడు. 859 నో = నొచ్చునట్లు. 862 బీరగాడు = తేజోవంతుని. సెప్పుడు = చెప్పుట. 865 ఊపరలు = పరోక్షమున నిందించుటలు. 867 పాడి = ఒడ్డి. పోల్చిచూడుడు దశకుమారచరిత. ఆ-౬-౯౬. 868 వసిమి = సౌభాగ్యము. 869. అన్నింతియ-"అన్నిష్టసఖియూదియున్నదాని" భార-ఆది. పలి = పల్లని. నగ్నము = దిగంబరత్వము. చెట్లపురులు = ఆశ్చర్యములపుట్ట. 870 కుడిముట్టు = భోజనపాత్ర. గుడిమురి = స్మశానము. వలువు = వస్త్రము. బడరుడు = దరిద్రుడు. 871 చెప్పు = చెప్పెడుమాట. 872 ఎడలించియు = పోగొట్టియు. 874 కొఱగడు = నీచుడు. ఓచెల్ల = బాపురె. కనుడు = కనుట. 880 కొఱడు = స్థాణువు. "బలుగొఱడు పోలె నెండకు। జలికిని వానకును నోర్చి" పంచతంత్రి. 894 కావుడు = అగుట. 897 నోసిన = నొచ్చిన. నెఱవిడుపు = గ్రహణమోక్షము. 901. వినిమీలిత దృష్టికని లోలదృష్టికిని భారతీయము చూడుడు. 903 కల్లడి = పొంగు 946. పోల్చిచూడుడు:— "ఆపురి సున్నతస్ఫటికహర్మ్య విభాపటలంబునింగిను। ద్దీపితమైనజూచి యిది దివ్యతరంగిణి యెత్తివచ్చెదా। నీవయిత్రోవనంచు బయలీదుచు గోయదలంతు రగ్రసం। స్థాపితహేమకుంభములు తామరలంచు వియచ్చరాంగనల్" పినవీరభద్రుని శాకుంతలము-ఆ-౧.

943. "గండరించు" అనునది, "కండరించు" అని యుండవలయు. రాతిలో నాకారమేర్పఱచుట యని యర్థము. చూడుడు "శ్రీనాథపద్ర్తదిం కండర

సిద సతిపోల్ కౌస్తుభం మేఘసూకాకారంపోల్" గుణవర్మకూద్రకము. ఆ-౧-౧.

961. గట్టివాలు = గంధపుష్పములు సేయు లేక యమ్మువాడు. గట్టివాలితి-స్త్రీలింగము. "ఎలిమిఁ మెచ్చిన గట్టివాలితియనఁ" యని మేమి ప్రెగ్గడ ప్రయోగించియుండును. కన్నడమున :—గట్టివాల్తి యనిసైరంధ్రికిఁ బేరు. "చందనగంధక్కం పదనేంచి పరపరిమళక్కె మెఱుగున భృంగబృంద మనుఱి సోవుత్తుం మందైసిమగుడ్చి గట్టివాల్తి యుమెసగుం"॥ గిరిజాకల్యాణం ఆ-౨-౯౧. "పరిమళలోభపిం...... గట్టివాల్తియక్" మల్లినాథపురాణం ఆ-౧-౯౦. ఈ శబ్దవిషయమై సీతారామాచార్యులవారి యుత్పత్తియుఁ బ్రయోగమును సరియైనవికావు. ప్రాచీనకవి ప్రయోగసారస్యము తెలియకయే పెక్కు గ్రంథములు ముద్రితములైనవి, ఇదిశోచనీయము.

79. ఆపోవక— "రూపుగ మెయిఁ గదిచినచో నాపోవక చాయఁ జూడనగుఁగంసన్నృపా" మంచిభట్టు అశ్వశాస్త్రము.

164. హరి తన నేత్రములతో శివపాదార్చనము సేసి శివుని మెప్పించి యతనిచే సుదర్శనంబు వడసెనని కొమ్మన శివలీలావిలాసము ౧౩-వ లీలలో నున్నది. జలంధరుఁడను రాక్షసుడు హరిని వప్పనకుం జిమ్మి బ్రహ్మాదుల జయించి దేవతలకు వెఱగొంగయై శివుం దఱిసి యుద్ధమునకుఁ బిలుచుటయు సముద్రవేలావనంబున విహరించుచున్న శివుఁడు సముద్రవుసీటిని పలయాకారం బుగాఁ గాలివెన్నుఁ బ్రేలిపుడుముస లిఖించిన నందుండి సుదర్శనంబు కలిగినట్లు పై కృతిలో ౨వ ఆశ్వాసమున నున్నది.

202. అబ్బగింపక = ఓర్వజాలక. 252. కంపు = పుంచివాసన. "సీ. ఆనక యమృతంబుఁ దానిట్టిదనియని జనుల తేర్పఁబునఁగాఁ జాలువారు। చూడక మన్మథు సుందరాకారంబు గరిమఁ జూపఁగఁ జాలునదకవారు।వినకయ పరతత్త్వవిపులనినాదంబు వినిపింపఁ జాలెడువెరవువారు। నంటక మెఱుపుంపుసుం దంబు ప్రేఁగును గణుతింపఁ జాలుప్రఖ్యాతివారు। కంపుగొనకయ కల్పవృక్ష ములపుష్పసౌరభం బిట్టి దని చెప్పఁజాలువారు। నెంచుఁ జూచిన ధాత్రిలో హృదయ దృష్టిఁగవులుగాననిమర్మంబు గలదె జగతి." అని కేతనకావ్యంబని. 239. మేఘ డంబరము = ఆతపత్రము. "సుత్తిదపెంపవాన పెరపెంపిర లోలకటాక్షమూలెయం......మేఘడంబరద తణ్ణెళలోళ్" మల్లినాథపురాణము, ఆ-౫-౯౪.

259. నామరు = పాచిక. 313. ఉప్పయనము. "లలితసరోజసౌరభములంగలయం జనిచూచి యెందు మెచ్చొలయమి నా పురాంగనల యొప్పెడు వక్త్రసరోజ గంధముల్। పలుమఱుఁ గ్రోల సౌధములపై కలివర్గము లేఁగు దానసం। కలిత గజేంద్ర గండఫలకంబుల కుప్పయనంబు సేయుచున్." భట్టురాజు గౌరీకల్యాణము. 432—433. శివుఁడు శరభావతార మెత్తి మిక్కిలి తామస వృత్తితోఁ బ్రవర్తించుచున్న నరసింహునిఁ జీరె నమకథయు బలి నోడించి తన విశ్వరూపంబు నుపసంహరింపక పీఁగుచున్న త్రివిక్రమదేవునినోర్చి యద్దేవుకంకాళంబు శివుఁడు ధరించినకథయు నిశ్శంకకొమ్మన శివలీలావిలాసమున క్రమముగా ౩౨-౩౪ వ లీలలలో వర్ణింపబడినవి.

473. అబ్జసూత్రగుణమనుటకు- "గొనయముతమ్మినూల్ చెఱకుఁగోల ధనుర్లత" విక్రమసేనము. ఆ-౧

496. ఊజపడి మదము పట్టిన యాడయేనుఁగు. "కచభారం కొరల్గబలెయ కచకుచభర మసియనడుగె కచకుచజఘనో । పచయభరం తొడెగగ్గె విచతురిందం మెట్టి తోర్వళోజెయపడెయం" రన్నని యజితపురాణం-ఆ-౨-౪౨. 502 కాపువచ్చు ననుటకు మఱియుం బ్రయోగములు. "దీనిలోపలఁగొన్ని దినము బూసిన నుష్ణకరుఁడైన నటు శీతకరుఁడు గాఁడె। దీని లోఁతెఱిఁగిన దానంబురాశిలోఁగాదని జలశాయి కాపురాఁడె। దీని తియ్యనినీరు దివిజులు త్రావినఁదమయమృతంబుఁ జేఁదనుచు ననరె" అని కేతనకాదంబరిలో నచ్ఛోద సరోవర్ణనము. మఱియు, "పల్లవపుష్ప సంపదలఁ బంచి వసంతుఁడు కాపురాకకై। యెల్లవనంబు సంకటము లేఁదఁగఁదా రొడికంబుమీఱ నట్లల్లన క్రోలిక్రోలి మలయానిలుఁడందుఁ బురాణపత్రముల్। డుల్లఁగఁజేసె సత్క్రియఁ బటుత్వము కాముఁడు విచ్చలింపఁగన్." సోమయాజి విజయసేనము. 597 తిట్టంబు = చిత్రము వ్రాయమొదట నేర్పఱచుసీమ. "బరయ లెంచు బట్టిగె పలగె యంతరిసి తిట్టమిట్టు." ఆదిపురాణం-ఆ-౯-౬౮. 597. వన్నువ = వర్ణము వన్నువు-అని, "కెమ్మోవివన్నువూన్చి" అని మరల కవి ప్రయోగించెను. "కామితఫలము జక్కవలకు నొసఁగెడి సాంద్రపల్లవ పారిజాత మనఁగ। రంజిల్లఁ గెందామరలకు వన్నువపెట్టి నలువ గూర్చిన కెంపుఁగులిశ మనఁగ" వన్నువునకు, "ధరణీజగుల్మలతావితానము పల్లవములకుఁ గట్టెజ్జవన్ను వొసఁగి" అని ప్రాచీన కవి ప్రయోగములు గలవు. 670. రేమెండ = వాహాలిపమే యనుటకు, "రేయి

వెన్నెల నాఁటి రేయెంత యుదయింప వెడఁగు చకోరంపుఁబిల్లలనఁగ'' వినవీరుని శాకుంతలము. ''కాటుకకొండపైఁ గాయు రేయెండకుఁ జెలువైన పచ్చనివలువ వాని.'' కవిలోకబ్రహ్మ. 704. పదికంపుఁగుడుపు వెట్టి యేనుఁగుకొమ్ము రోకండ్లతో వెడఁదవియ్యము దంచుటకు ''కుమరుగఁ జంగ సాఁచి చనుగుబ్బలు సూటిగఁబారుటాకుప। య్యెద పొదలంగ నెన్నుదురొకింత చెమర్పఁగ మేచెబాలి (?) నే। ర్పు దొలఁకఁజాడి చందనపురోలున నేనుఁగుఁగొమ్ము రోఁకటఁ బ్రిదిలెడు కొప్పుతో వెడఁదవియ్యము గుప్పనిజప్రియాంగనల్'' అని రఘునాథరాయల వాల్మీకి చరిత్రము-ఆ-౨-౧౧౮.

760. పోల్చి చూడుము. ఆముక్తమాల్యద. ఆ-౪-౭౨. 790. ఈ పద్యమునకుఁబూర్వ మొక్కపద్యము నాప్రతులలో విడిచిపోయినట్లు తోఁచుచున్నది. ప్రబంధమణిభూషణములోఁ గుమారసంభవములోనుండి యేడాశ్వాసములలో ౪౦, ౨౬౭, ౨౫౩, ౪౪౭, ౭౭౪, ౭౯౧, ౭౯౨, ౭౯౮, ౯౩౩, ౯౬౩. ఈ పద్యము లుదాహరింపఁబడినవి; దీనిలోనివని యీ క్రిందిపద్యము కూడ నీయఁబడినది. అది నా ప్రతులలో విడిచిపోయెనేమో. ''భూచరులంబరంబునకు పోవుటమేలన నంబరేచరుల్। భూచరవృత్తి మేలనఁగ భూచరఖేచరులాజలప్రవకే। శీచరణంబు మేలన జలేచరులంబరమధ్యయానమా। త్రీచరణంబు మేలనగఁ దీవ్రనిదాఘము పర్వె నుర్వరన్'' ఇది 792గా నుండవలయు. దీనిఁ గేతనకాదంబరిలోని క్రిందిపద్యముతోఁ బోల్చి చూడుఁడు.

సీ॥ కడువేఁడిపెల్లెంద పుడమి పేల్చినఁబొద్దు
 లాకాశగతియె మేలని తలంప
వాత్యాభిహతి లగ్గ వాడి వియచ్చరు
 లవనిపైఁ జనుట మేలని తలంప
వడవడగా నీరు లుడికెన జలచరుల్
 వనచరవృత్తి మేలని తలంప
వనములఁ గార్చిచ్చు దనరిన వనచరు
 లంబుసంచరణ మేలని తలంప
వాఁడిమెండ గాసె వడిగొనె సురగాడ్పు
లెసఁగె వడయగాలి నెగసి వీచె
పావవహన మడరె జీవుల కధిక సం
తాపకారి యగు నిదాఘవేళ. —కేతనకాదంబరి.

792. పోల్చిచూడుఁడు "ఎత్తుగీతె. తలఁపఁదఁతవ మనము దరికొనుఁ జూచిన తెప్పలెల్లఁ గమరి యొప్పు తఱుగు। నపటఁ బేరికొన్న నాలుక వొక్షు నిదాఘకాల తపన తాప మడరె." విజ 812. ఉప్పరిపెనము — "కలయంగ ధారణీతల మగ్నిత ప్తమై యుప్పరిపెనపట్టు లుచ్చిసుంసుఁ। సంపన్నతంబులు కొలిమిలోఁ గ్రాఁగినయినుపముద్దల క్రియ నెనఁగి యుండ" విజయసేనము 961. గట్టివాలు — మఱియొక ప్రయోగము :— "సీ. ఘనసారకస్తూరికా గంధముల నన్యగంధబంధంబులు గఱపి కఱపి। కుసుమితవల్లికాలసితవీథులఁ జొచ్చి గని సరోగృహములఁ మునిఁగి మునిఁగి। సమధికాహార్యాంగ సంగీతము లతోన కన్నెతీగల కాట కఱపి కఱపి। కుముదకుట్మలకపికోరకంబులు దూఱి యలిదంపతుల నిద్రఁదెలిపి తెలిపి। యమడిసన్మ నవ్వరాంతికమ్మున గట్టి। వాలువోలె విప్రవరుడు వోలె। నట్టు వోలెఁ దాను నచ్చినచెలివోలె। మలయు చుండు మందమారుతంబు."

పీఠికలో-౧-వ యాశ్వాసములోని చంద్రికావర్ణనము జక్కన గైకొన్నట్లు ఆ రెండుగ్రంథములలోని పద్యములు చూపితిని. తద్వర్ణనమునే కృష్ణవిలాసమున వేంకటకవి "సీ. ఆకాశనది యని యనిమిషాంగనలెల్ల వేడుకతో జలక్రీడ సలుపఁ బాలమున్నీరని పంకజనాభుండు ఫణిశయ్యఁ గావించి పవ్వళింపఁ। బాదరసంబని మోదించి సిద్ధులు మించి ఘటంబుల నించుకొనఁగ। నమృతంబుసోనని యఖిలా మరశ్రేణి చెలఁగి పానంబులు సేయుచుండ। వెల్లివిరియుచు నుబ్బుచు విశద కాంతిఁ బొదలుచును దివ్య మగుచును భూరిమహిమ। నఖిలజీవుల కానంద మతిశ యిల్ల। నచ్చవెన్నెల విమలమై పెచ్చు పెరిగె." చోళుని ఈ భావములలో జక్కన యొక నాలుగును వేంకటకవి మఱియొక నాలుగును గ్రహించుట చోద్యము. పాదములును మార్పులేకున్నవి. పైకృష్ణవిలాసముననే, "నిజరూపరేఖల నెలఁతల వలపించుచాతురి గలభద్రజాతివిటులు। పలిసినఘనము లవ్వారిగా నొసఁగుచుఁ దరుణులఁ గరఁగించు దత్తవిటులు! మణిమంత్రములచేత నణుమధ్యలఁ గరంచు మగటిమిగల కూచిమారవిటులు। వలరాజుకళ లుండు నెళవులు భేదించి సతులఁ దేలించు పాంచాలవిటులు। వరుస నంచలు తమజాతివారి వారిజాతవదనలఁగూడి సంజాత మదన। కదనకేళీవిహారసంపదలఁ బొదలి। మొదలుమదు వీట నధిక సమ్మదము లొసఁప" అనుపద్యము, కుమారసంభవములోని ౧-వ ఆశ్వాసమున నుండు క్రింది పద్యములోనుండి గ్రహింపబడినది :— కమియని లేని శృంగా

రాదిచేష్టలఁ బచరించుచుండు నాభద్రునొల్ల। మృదురేఖ ననురక్తిఁ బొదలించి తనమెల్లఁ గాపించుకొనునా పాంచాలు నొల్ల । ధనమెక్క నీగియ తగులుగా రతి పెట్టివసు సేయునట్టి దత్తకుని నొల్ల। మనసీక మందుల మాయల మరగించి కారించు నాకూచిమారుని నొల్ల। గలిచి తాల్మి గల్గఁ గలిపించి పేరుంబు నలుపు నెదురఁ దన్నుఁ గలిచెనేని। దానుఁ గలిచెనేని తగ నిచ్చు నయవిముం డని మనోజ్ఞునొక్కవనిత గలిచె." కుమా. ఆ-౮.

ఈ కృష్ణవిలాసకర్త యగు వేంకటకవి, కవిస్తుతిలోఁ గవిత్రయమును వేములవాడ భీముని కేతన కవిరాక్షసుని శ్రీనాథసోమభాస్కర పుత్తేటి రామన పెద్దన తిమ్మన తెన్నాలి రామలింగుల స్తుతించి యుండినందున నిటీవలివాఁ డని చెప్పనక్కఱలేదు. నన్నెచోళుని ౨౦౦ సంవత్సరముల కిటీవలివాఁ డని చెప్ప సాహసింతురేమో. పైఁ జూపఁబడిన పోలికలన్నియుఁ దత్తత్కవులకు వేఱు వేఱు హృదయములలోఁ దోఁచె ననియు నన్నెచోళుని కావ్యము వారు చూచిన వారు కారని మనస్సిద్ధాంతవేత్తలు చెప్పినచో నంగీకరింపవలయును.

# 2. కుమారసంభవము

## ద్వితీయ భాగము

ఇమ్మహాకావ్యమునకుఁ గర్త నన్నెచోడదేవుఁడు. అతఁడు కవిరాజ శిఖామణి యనియుఁ డెంకణాదిత్యుఁ డనియు బిరుదములు గలవాఁడు. నన్నియఘట్టాదిశబ్దములలో ద్వితీయాక్షర మికార మగుటను గొన్నిశాసనములలో నన్నిచోడుఁ డని యుండుటచేతను నన్ని యని సత్యార్థకవాచక ముండుట చేతను నన్నిచోడుఁ డని చెప్ప నొప్పును. చోడశబ్దము కంబఁడు, తిక్కఁడు మొదలగుశబ్దములవలెఁ జోడఁ డనియుఁ, జోడు అనియు నిరుదెఱఁగుల వర్తించును. అయినను నా ప్రతులలో నన్నెచోడుఁ డని యున్నందున శబ్దరూప నిష్పత్తు లెట్లున్నను దానివర్ణక్రమము మార్చి వ్యవహరింప ధైర్యము చాలక యట్లె ప్రయోగించుచున్నాఁడను. ఇక్కవి సూర్యవంశజక్షత్రియుడు; చోడ బల్లికిని శ్రీసతికిని బుత్రుఁడు. వివిధయజ్ఞములకుఁగర్త; జాజిపొన్నలు పూచు నట్టిదియు జాతికోడి గట్టిగాఁగూయునట్టిదియు నగునొరయూరికి నధిపతి. కావేరీ తీరమున నుండు నొరయూరిపురమునకుఁ గోళి (కోడి)యనునామము కలుగుట ద్రవిడభాషాకృతులలో సుప్రసిద్ధము. ఆంధ్రచోడులు కారితకావేరీతీరకరికాల చోళవంశజు లగుటయు నొరయూరిపురవరాధీశ్వరు లగుటయుఁ [illegible] విఖ్యాతాంశములు. అయినను నన్నెచోడునివర్ణనము నించుకచక్కఁగానాలో చించినచో నతఁడొరయూరికే పరిపాలకుఁడనియుఁ గేవలము కులక్రమాగత బిరుదమును బేర్కొన్నవాఁడు గాఁడనియుఁదోఁచకమానదు. మననన్నెచోడుఁ డెక్కాలమున నుండెనో నిర్ణయింపఁ దగినయాధారములు సంపూర్ణముగా లభింపవయ్యె. లోకములోని మహాకవుల గతు లన్నియు నిట్లె సందిగ్ధమత భేదములపాలయ్యె. లోక మితని కవితాప్రభావ మిట్టిదని యెఱుంగఁగాఁబోలుఁ గాలము తనపట్టీయక మనల వంచించుచున్నది.

పురాతనశాసనములు పరిశోధింపఁగాఁ బెక్కండ్రు నన్నెచోడు లగపడు చున్నారు. వారిలోఁ గొందఱు చోడబల్లి యనురాజునకుఁ బుత్రులు. ఎందునఁ దల్లిపేరులు లేనందున మనసిద్ధాంతమునకు నప్రతిహతసందేహము లెక్కువ

యగుచున్నవి. ఒకనన్నెచోడుఁడు పాశ్చాత్యరాజులచే రణరంగమున క్రీ-శ-కాలం లో నిహతుఁడయ్యెను. దర్శిసీమలోని మన్నెపల్లిగ్రామముతోఁ జోడపల్లి శాసనములలోఁ బొత్తపినన్నెచోడునకు వెంకభూపతియు నతనికిఁ గామరాజు నతనికి బల్లిభూపుఁడును జనించినట్లున్నది. దీనిలో నన్నెచోడునకుఁ దండ్రిపేరును బల్లిభూపునకుఁ గుమారనామములును మన కనుకూలముగా లిఖింపఁబడవయ్యె. క్రీ. శ. ౧౧౨౦ లో నుండిన భద్రభూపాలునకు నన్నెచోడనరేంద్రుఁడను బిరుదము గలిగియున్నట్టు నీతిశాస్త్రముక్తావళిలోఁ జెప్పఁబడినది. వీఁడెవ్వఁడో ప్రాచీనుఁడు; పెద్దచెఱకూరిలోని మల్లిదేవునిశాసనములోఁ జోడపల్లికుమారుఁడు నన్నిచోడుఁడు, అతనిపుత్రుఁడు సూరరాజు, వానిపుత్రుఁడు రాజరాజు, వాని మనుమఁడు మల్లిదేవుఁడు, వానిపుత్రుఁడు నన్నిచోడుఁడనియు నున్నది. ఇది గణపతిదేవునికాలములో లిఖింపఁబడినశాసనము. వీరలు గాక పెక్కండ్రు నన్నెచోడులు గలరు. ఇఁక బల్లయచోడులును బలువురుగలరు. క్రీ. శ. 1135 లో దాక్షారామశాసనములోఁ గన్న రాజేంద్రచోడునితమ్ముఁడు చోడబల్లి యొక్కఁడును, గొణిదెనశాసనములలో నిరువురును, గడల్పల్లెశాసనములో నొక్కఁడును గాక ప్రాచీనశాసనములలోఁ గృష్ణాతీరముననుండు బీచుపల్లి సమీపమున నుండుశాసనమునఁ జోడబల్లిదేవుఁడును, మఱియొక ప్రాచీన శాసనమున బల్లయచోడుఁడును బేర్కొనఁబడియున్నారు. వీరెల్లరును క్రీ. శ. 850 మొదలు 1210 లోఁగా నుండినవారు. వీరిలో నెవఁడు కుమారసంభవ కావ్యకర్తయో నిర్ధారణము సేయుట సులభసాధ్యము కాదు. దీనిలోనిపద్యము మొట్టమొదట నుదాహరించిన యథర్వణుని కాలనిర్ణయము సహితము సందిగ్ధమే.

కృతిపతి యెవ్వఁడో చూతము. అతఁడు జంగమమల్లికార్జునమహాముని యఁట. అతఁడు సాక్షాచ్ఛివావతారము. శ్రీచక్రపీఠమునఁ బాదము లిడినవాఁడు, కమలభవకుల తిలకుఁడు, అస్పృష్టరాగుఁడు, వినిర్జితాంగభవుండు, అణిమాది గుణగణాలంకారుఁడు, అమితాథవాగమవిశారదుఁడు, సన్మునీశ్వరాగ్రణి, సంకల్పసంభవబాణేంధనదావపావకుఁడు, పరవాదీంద్రఘనాఘనానిలుఁడు, హృజ్జన్మాస్త్రానలభిజ్ఞుఁడు, మారారి, అక్షజయుఁడు, అస్ఖలితుఁడు, ఇహాముత్ర భోగాద్యనిష్టుండు, కుంభజతత్త్వజ్ఞుఁడు, జన్మజరామాయుఁడు, అసంగుఁడు, కృత్యాకృత్యవిరక్తుఁడు. ఇట్టిముని తప్పక బ్రహ్మచర్యానవస్థితుఁడు గాని

యింద్రియసుఖము లనుభవించి దౌర్బల్యదారిద్ర్యయత్యాశ్రమాదులవలన సంగ సుఖమును పరిత్యజించి హ్రా న్మాస్త్రానభిజ్ఞుఁడు నస్ప్రష్టరాగుఁడను బిరుదములు వహించినవాఁడు కాఁడు. | చీనులలోఁ బ్రఖ్యాతు లగుమల్లికార్జునులు మూవురు గలరు. గృహస్థుఁడై పుత్ర త్రులనుగాంచి యనేకశిష్యకోటికద్భుతమహత్త్వ ములు చూపిన శృంగిరిటిపుపతారమగు పండితారాధ్యుఁ డొక్కఁడును, జతుర్దిక్కులకధిదేవతలగు శైవాచారగురుపరంపరలో యామ్యదిక్కులశాధి పులలో వానప్రస్థాశ్రమవర్తియగు యోగిమల్లికార్జునుఁ డను నతఁ డొక్కఁడు. ఇతఁడు చాలఁ బ్రాచీనగృహస్థుఁ డగుటచే మనకాలమునకుఁ దగిలి వచ్చువాఁడు కాఁడు. తపోరాశి శిష్యుఁ డై చోళరాజులచేఁ బూజితుఁడై కాలాముఖ మతస్థాపన మున కాదికారణ మనఁబడిన మల్లికార్జునమహాముని మూఁడవవాఁడు. కాలాముఖ మతాచార్యు లెల్లరు బ్రహ్మచారులు. ఈమతము ప్రారంభమున నెచ్చట నుండెనో కాని క్రీ. శ. 1050 లో నుండి వనవాసిదేశమున బలిగ్రామ మనుపురమున నెల కొన్నది. అందే బౌద్ధజైన మతములును బ్రఖ్యాతము లయ్యె. పుదుకోట సంస్థా నమున నుండుకొడుంబాలూరు (ఆంగ్లేయభాషా పర్ణక్రమహైన్యముచేత మోస పోయి స్థలాంతరమునఁ గదంబలూరని పేర్కొంటిని) గ్రామమున నుండుమూ వర్కోవిలు శాసనములలో విక్రమకేసరి యను చోళరాజు తపోరాశి శిష్యుఁ డగు మల్లికార్జున మహాముని నత్యధికముగా సంభావించినట్లున్నది. విక్రమకేసరి పూర్వులు చాళుక్యపల్లవపాండ్యుల జయించినవారు. మల్లికార్జునుఁడు మధురా పురాగతుఁడు. అతనిపేర రాజు మఠమును గట్టించెను. కుంభఘోణపురమున మల్లికార్జునమఠమనుశైవశాక్తేయమఠమొకటి గలదు. కొడుంబాలూ రొరయూరు పురమునకుఁ గొంతసమీప భూమిలోనున్నది. ఈవిక్రమకేసరి వీరపాండ్యుని జయించియున్నందున, క్రీ. శ. పదియవ శతాబ్దపు బూర్వార్ధములో నుండెనని శాసనపరిశోధకుల సాంవత్సరిక ప్రకటనములో రాయబహద్దరు వెంకయ్యగారు లిఖించియున్నారు. కృష్ణాతీరమున బీచుపల్లి గ్రామశాసనములోఁ జోడబల్లి దేవుఁడు విజయయాత్రలోఁ గృష్ణాతటమున నుత్తరాయణ పుణ్యకాలమున విశ్వ నాథదేవునకు క్రీ. శ. 902 లో భూదాన మిచ్చినట్లున్నది. చోడబల్లి పాకనా డిరువదియొక్క వేయిటి కధీశుఁడని కుమారసంభవమునఁ గలదు. బీచుపల్లికిఁ దూర్పున 50 మైళ్లదూరమునఁ దుంగాతటమున నలంపుర మను మహాక్షేత్రము కలదు. అందులో ననేక శాసనములలో సూర్యరాశి, తపోరాశి, తేజోరాశి, కాశి రాశి మొదలగుకాలాముఖాచార్యులకుఁ బాశ్చాత్య చాళుక్యరాజులు బహు

విధ సమ్మానము లొనర్చినట్లున్నది. వారివిగ్రహములు సహితము మూలస్థాన ములో వారివారి పేరులతోఁ గలవు. ఈప్రదేశము శ్రీశైలమునకుఁ బశ్చిమద్వార మనఁబడును. మధుర సమీపములో మహాసిద్ధుడై ఖ్యాతివహించిన మంథాన భైర వుఁడను శివాగమాచార్యుఁడు కొంతకాలము శ్రీశైలములోను నలంపురములోను వసించి తత్ప్రదేశములలోని సిద్ధౌషధులఁ దనయానందకందములో వివరముగాఁ బేర్కొనియున్నాఁడు. అలంపురమున బ్రహ్మేశ్వరుఁడును యోగీశ్వరియు (జోగు ళాంబయు) ముఖ్యదేవతలు యోగీశ్వరి యష్టాదశ శాక్తేయ పీఠాధిదేవతలలో నొకతె. మంథాన భైరవ తంత్రమున శివాద్వైతశాక్తేయరసవాద రహస్యములు వివరముగాఁ గలవు. అలంపురమును విస్తారముగా సంభావించిన రాజులు చాళు క్యులు. రెండవకీర్తివర్మ రాజ్యభ్రష్టుఁడైనప్పుడు రాష్ట్రకూటులు మాన్యఖేట పురమున రాజ్యము చేయుచుండినను జాళుక్యరాజులు సామంతులై యుండిరి కాని యనామకులైరి కారు. అలంపుర శాసనములలో మూఁడిటిలో బలవర్మ యనురాజు ప్రఖ్యాతుఁడుగాఁ బేర్కొనఁబడెను. ధారావర్షుని రాజ్యకాలములో నున్నట్లు చెప్పఁబడియె. శ్రీశంకరపాదు లుపనిషద్వ్యాఖ్యలలో మూఁడుచోట్ల నొకబలవర్మను బేర్కొనెను. శంకర పాదులు శ్రీశైలప్రాంతముఁ గొంతకాల మున్నట్లు శంకరవిజయాదిగ్రంథములలో నున్నందున మహాశాక్తేయ పీఠమగు నలంపురమును దద్దేవీపూజాపరతంత్రుఁ డగుఁ బలవర్మను వారెఱిఁగి యుందు రేమో యనుసందేహము కలుగుచున్నది. ఈబలవర్మ చాళుక్యరాజు. బనవాసి దేశమునకుఁ బ్రభువు. చోళరాజులకు ద్వేషి. బళ్ళారిమండల శాసనమున నితని మునిమనుమఁడు తనపూర్వవంశమును వర్ణించుకొనుచు "శ్రీమచ్చాళుక్యవంశే సమజని నిహతా శేషశత్రుక్షితీశో న్యాయోపేత.......హృష్టోద్యద్దండకాయాం సమకృత బలవర్మోధిపః పట్టబంధం సంగ్రామైకరతః పరాక్రమఘనః కాంచీప ముగ్రాహవే జిత్వా వీరగజేంద్ర దన్తయుగళం సంస్థాప్య నామాంకితం ఖ్యాతా లంపుర నామధేయనగర బ్రహ్మేశ్వర స్యాగ్రతః సోయం తస్య సుతో హ్యభాయి దశవర్మాఖ్యః ప్రచండోదయః ...,..." అని చెప్పె.

ఈ శాసనకాలము క్రీ. శ. 924. దీనినిబట్టి చూడఁగాఁ జాళుక్య చోళ రాజులకు యుద్ధములుసహజమని తెలియుచున్నది. రాష్ట్రకూటులక్రిందఁ బెక్కండ్రు చాళుక్యులు గొప్ప సేనాపతులైయుండుట బహుశాసనములవలనఁదెలియుచున్నది. నాయభిప్రాయమున శాక్తేయరసవాద శైవాచార్యులెల్లరు మధుర, యానమలై,

అగస్త్యాశ్రమము, శ్రీశైలము, నాగార్జునకొండ మొదలగు ప్రదేశములలో నుండి తమసిద్ధాంతముల నెంకొల్పుచు దేశాటనము సేయుచు రసరసాయన శాస్త్రముల మహోన్నతికిఁదెచ్చిరి. ఈశాస్త్రములు బోధింపఁగానగస్త్యుఁడు,భోగర్,కొంకణర్, నట్టముని, మొదలగు ద్రవిడులు రసరసాయన శాస్త్రములఁ జూపినమార్గములు చరక, సుశ్రుత, వాగ్భట, శార్ఙ్గధరాది ప్రోక్తరసోపయోగ పద్ధతులకంటెఁ జాల భిన్నములైయున్నవి. శాంకరమతవ్యాపనమునకుఁ బూర్వము ద్రవిడదేశమున బౌద్ధజైనసంఘములఁ బ్రతిపక్షము వహించి పోరాడుచుండినది శైవమతము. దీనిలోఁ బెక్కు తెఱఁగు లుప్పతిల్లి కాపాలికమతముకంటె భిన్నమై రసవాద శక్తుల నమ్మి శివైక్యము పరమార్థ మనెడు శైవభేదముకలదు. దీని నగస్త్యుఁడు పన్నిరాయిరములో, భోగరు ఏడు యిరములో కొంకణరు మువ్వాయిరములోను రససిద్ధులగుటకు మార్గోపదేశము సేయుచు శివైక్యము పరమముగాఁ బ్రసాదించిరి. ఇట్టి సిద్ధులకాలములోఁ గేవలమర్థవాదులగు బౌద్ధజైనుల నోడింప శంకరు లద్వైతార్థమును వెల్లడించి మార్గాంతరమున వారికిఁ బరాభవము కల్పించి దేశము నందెల్ల షణ్మతస్థాపనము చేసిరి. అచక్రాంకమగు వైష్ణవము సురాపాన వర్జిత మగు శాక్తేయమును గూడ వారంగీకరించిరి. అంతఁ దత్కాలములోని శైవ మతములన్నియు నద్వైతము నాశ్రయించి ప్రబలుచునే యుండినవి. తరువాత మూఁడునూఱు సంవత్సరములకుఁ బిదప రామానుజమతము లోకవ్యాపక మయ్యెను. కేవలశైవము ద్రవిడదేశోద్భూత మనియు వైష్ణవమత ముత్తరము నుండి దక్షిణమును జయించుచు వచ్చిన యార్యులవలనఁ బుట్టెననియు నాయభిప్రాయము. ఇట్లద్వైతము జీవాతువై సాంఖ్యయోగవైశేషిక బ్రహ్మసూత్రముల ననుగుణమైన శైవమతాంతర్భేదములు నెలకొన్నకాలములో మల్లికార్జునుఁడు ప్రఖ్యాతుఁడయ్యెనని కుమారసంభవ కావ్యపఠనము వలనఁ దేలుచున్నది. వీర శైవము బసవేశ్వర పండితారాధ్యుల వలన నియమితమై లోకవ్యాపకమై నూతన స్వరూపమును బొంది సంఘములోఁ గొంతభాగము నాకర్షించుకొనెను. కాని యనాదిగ శైవమతము కాలము ననుసరించి భేదములు చెందుచుండెను. మొదల శైవము పాశుపతము, శైవసిద్ధాంతము, యోగశైవము, రసశైవము, ఆగమ శైవము, కాపాలికము, కాలాముఖము, లాకులము, నకులీశము, వీరశైవము మొదలగు బహుభేదములఁ జెందెను. వీనిలో లాకులమునకే నకులీశ మని విద్యారణ్యులు చెప్పిరి. పాశుపతము, కాపాలికము, రౌద్రము లని శైవాగమము లోనే చెప్పఁబడెను. "పత్యు రసామంజస్యాత్" అను సూత్రముక్రింద

శ్రీ రామానుజాచార్యులు "తన్మతానుసారిణ (పశుపతిమతస్థా) శ్చతుర్విధాః కాపాలాః కాలాముఖాః పాశుపతాః శైవాశ్చ ఇతి, సర్వే చైతే వేదవిరుద్ధాం తత్త్వప్రక్రియాం. . .కల్పయంతి. . .తథా కాలాముఖా అపి కపాలపాత్రభోజన శవభస్మస్నాన తత్ప్రాశన లగుడధారణ సురాకుంభస్థాపన తదాధారదేవపూజాదిక మైహికాముష్మిక సకలఫలసాధనమభిదధతి" అని కాలాముఖులఁ గాపాలికులతో నేకముగాఁ జెప్పెను. కాని కాలాముఖులు వేదబాహ్యులు గారు. కాపాలకాలాముఖమతములు మొదట శ్రీశైలములోఁ బ్రబలెనని యెఱుఁగుము. మాలతీమాధవమునఁ గపాలకుండలయుఁ దత్ప్రాంతములోనిదని భవభూతి వచించెను. కాలాముఖులకు మహావ్రతు లను నామము నాసికబల్లిగ్రామాలంపుర శాసనములలోఁ గలదు. మహావ్రతమని యాజ్ఞికులలోఁ బౌండరీకమునకు నామాంతరమైనను గాలాముఖ బ్రహ్మచర్య కాపాలిక వ్రతమునకు సంకేతనామము. కుమారసంభవమున నీయనివిషయమై "హరికంకాలము చేతిముద్ర విధిజేంద్రాస్థుల్ సుభూషావళుల్। గరళం బభ్యవహార మంతకతనుక్షారంబు మైపూఁత వం।కదుహాసీను శిరఃకపాల మురుభిక్షాపాత్రగా విశ్వనం। హరువర్తించు మహావ్రతోపహతి నీయంబున నీప్రాప్తియే." ఇది రతిమన్మథునితోఁ బ్రసంగించిన వాక్యము. మారమద ప్రహరుఁడగు శివావతార మల్లికార్జునునకును జెల్లుట యాశ్చర్యము కాదు. సురాకుంభస్థాపనాదులకుఁ గుమారసంభవమున, "అంచకొందఱు మధుపాన గోష్ఠికింజొచ్చి మండలార్చన దీర్చి ... సుగంధాసవంబులు...చషకంబుల నించి హర్షించి. మ. శివు గౌరీసహితంబు సన్మనముఁ జింతించి మైతెంచి భైరవు యోగీంద్రులఁ గొల్చి యోగినుల వీరవ్రాతమున్ వస్నియా। నవనాథాదు లనాది సిద్ధులకు నానందించి విందిచ్చియా। నవపాత్రల్ సతులర్థి నెత్తుకొని యాస్వాదించి మోదించుచున్" మొదలుగ వర్ణింపఁబడియెను. కాలాముఖులు యోగమార్గము నవలంబించి యష్టాంగములును గ్రమముగా ననుష్ఠింతురు. బల్లిగ్రామశాసనములోన "వరకాలాముఖచక్రవర్తిమునీ దివ్యజ్ఞాని"... "వామశక్తిదేవరతపః ప్రభావము మం నోడి యా మహానుభావరంయమనియమ స్వాధ్యాయధ్యానధారణ మౌనానుష్ఠాన జపసమాధి శీలసంపన్నరుం యష్టాంగయోగనిష్ఠాప్రతిష్ఠితనైష్ఠికచ్ఛాత్ర సంఛన్నరుం . . కవిగమకివాదివాగ్మిప్రముఖవివిధ విద్వజ్జనానందకారణ జంగమ కల్పభూజరుం వేదాంతసిద్ధాంతాగమషట్తర్కసకలవ్యాకరణ నిర్మలశాస్త్రవ్యానేక శాస్త్రార్థ నిర్ణయనిర్ణిక్తరుం.. శ్లో॥ యః పర్వతావపి విరాజితవహ్ని కీర్తికాంతాసభోఽపి ఋభవృందసుతాన్వితోఽపి నిత్యప్రియోఽపి యతి రిత్యభిధీయమానః శ్రీగౌతమో

ముని రభూ ద్భువనే విచిత్రం" అని యొకానొక కాలాముఖాచార్యుని వర్ణనము గలదు. ఈ లక్షణములు కృతిపతియగు మల్లికార్జునునకు గలవు. శివునితపస్సు వర్ణించునప్పుడు "పద్మాసనస్థుఁడై భావించి శోషణదాహనపావనతర్పణములు దేహోదయాత్మప్రతిష్ఠలు విధియించి యాగమరీతి బ్రహ్మాంగవర్ణ। విన్యాసములు దీర్చి విమలాత్మదీపంబు ప్రణవసంపుటముగాఁ బ్రజ్వలించి। వడి బాహ్యవర్తనల్ విడిచి ప్రత్యాహారగతి మనస్సంతర్ముఖమ్ము సేసి। తన్నుఁ దానె కాంచి తన యందుఁ జేతోలయంబు సేసి నిశ్చలాత్మయోగ। మయసుఖామృతాబ్ధిమగ్నుఁడై వరదుండు నిరతిశయసమాధినిష్ఠ నుండె" అని యోగమార్గధ్యానము వర్ణింపఁ బడియె. ఇందు నుదయ మనఁ బ్రాణము, బ్రహ్మాంగవర్ణములు శైవాగమమున సుప్రసిద్ధము. మూలబీజాక్షరములలో శివాంగము, బ్రహ్మాంగము, విద్యాంగము లని మూఁడుభాగములు. "బ్రహ్మాంగంచ తతః శృణు। ప్రథమా త్పంచసంఖ్యాని బ్రహ్మణీత్యుదితానివై" అని తల్లక్షణము. పార్వతియు "ఘోరతపంబు సేయఁ దొడంగి... నిరాహారాది మహాతపోవ్రతంబుల...ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణజపసమాధులనుషడంగ యోగంబుల మనోవాక్కాయకర్మంబుల" ... నిష్ఠఁ బూనియుండె.అవిద్యయనుమాయ జయించి తాను శివుఁడే యై సాయుజ్యము నుపాసకుఁడు చెందు ననుట యీ మహాపురాణనమము. కుమారసంభవమున "తాన సమస్తములోఁ దనలోనన సకలంబు గలుగ లోనను వెలియుం। దాన యయి తనకు వే ఱనఁగా నేమియు లేక తాన కలిగి వెలుంగున్" "తలఁపనని తలఁచి యించుక దలచుడుఁ దలపంగ లేక తానును లే కప్పలుకులును లేక యెప్పుడు కలిమియ పొడవైనవాఁడు గదిరి వెలుంగున్" "దనుజేంద్రు మాయ లన్నియుఁ బ్రసన్నసుమతుశక్తిఁ గని యదృశ్యంబయ్యెన్। వినుతాత్మజ్ఞానంబునఁ దనరుమహామాయ చెడువిధంబునఁబోలెన్." "దొరకొనునింద్రజాలమునఁదోచిన రూపము లింద్రజాలమం। చరయఁగ లేక చూపరకు నన్నియునిక్కమవోలె నైనయ। ట్లిరవుగఁ బాపమర్తికుల కెప్పుడు ద్రవ్యములెల్ల మిథ్యలై। నిరతము చూడ లోకులకు నిక్కములై చనుభ్రాంతిపెంపునన్." క॥ సుజ్ఞానయోగతత్త్వ విధిజ్ఞుల్ భవబంధనములఁ ద్రెంచుచు భువిలో నజ్ఞానపదముఁ బొందక ప్రాజ్ఞుల్ శివుఁ గొల్తు రచలభావన దవులన్॥" అని యిత్యాది భావములచే శివాద్వైత సిద్ధాంతము సూచింపఁబడియె. శ్రీకంఠ శివాచార్యులు తమ భాష్యమున జీవాత్మ పరమాత్మలకు, బ్రత్యేకతఁ జెప్పి విశిష్టాద్వైతములోని దాసభావము సూచించిరి. పండితారాధ్యాదులు నెలకొల్పిన వీరశైవమున జీవాత్మ పరమాత్మ భావనలోను

మాయాకల్పనలోను భేదములుగలవు. వీరి శైవదీక్షాప్రశంస యెందును మన కావ్యములఁ గానరాదు. కావునఁ గృతిపతి మల్లికార్జునుఁడు కాలాముఖమతస్థాపకుఁడే యని నా యభిప్రాయము. పండితారాధ్యచరిత్రమున నతని సమస్తశిష్యకోటులలో నన్నెచోడుఁడు రాఁడయ్యె. పాల్కురికి సోముఁడు పండితమల్లయ యనియే సవిశేషణముగాఁ జెప్పుచుండును. నన్నెచోడుఁ డెక్కడను మల్లికార్జునకుఁ బండితశబ్దమును జేర్చినవాఁడు కాఁడు. పాల్కురికి సోముఁడు పండితారాధ్యునిగూర్చి పుత్రపౌత్రసంతతికలవాఁ డని వర్ణించెను. పిక్కనవోలి కామినేని యెల్లారెడ్డి కంకిత మీయఁబడిన బ్రహ్మోత్తరఖండమునఁ గృతికర్తృగురువు లింగనారాధ్యుఁడు పండితారాధ్యుని పుత్రపౌత్రసంతతిలోనివాఁడైనట్లు చెప్పఁబడియె. ఇట్టికారణములు పెక్కు లూహింపఁగా గృతిపతియగు మల్లికార్జునుఁడు భృంగిరుపవతారమగు పండితారాధ్యుఁడు కాఁడనియు, శ్రీశైలప్రాంతమునఁ దపస్సుచేయుచు నలంపురమున మఠమును గట్టుకొని శైవమతమును నెలకొల్పుచుండినవాఁ డనియు తోచకమానదు.

చోళరాజులకును వనవాసిదేశపు జాళుక్యులకు యుద్ధము లగుచుండె నని శాసనము చూపఁబడియెఁగదా. ౯౭౦ క్రీ. శ. ప్రాంతములకె రాష్ట్రకూటరాజ్యలక్ష్మి ప్రాచీనచాళుక్యసంతతివశ మయ్యెను. అప్పుడు చోళరాజులు మాటిమాటి కలంపురీప్రాంతముల దండెత్తివచ్చుచుండఁగా గాలాముఖమతాచార్యులు బలిగ్రామ మగు దక్షిణకేదారక్షేత్రమున రాజసమ్మానమును బడసి మఠము నిర్మించుకొనిరి. మతాచార్యుల పరంపరయు రాజసమ్మానమును స్వనామాంకిత కావ్యములవలనను శిలాశాసనప్రశస్తి పద్యములవలనను లోకవ్యాపక మయ్యె. కుమారసంభవములో నాల్గవయాశ్వాసాంతమున నంకితాంకపద్యమను "హరహాసాకాశగంగాత్మమలజల మరాళాబ్జనీహారధాత్రీ। ధరకర్పూరేందుకాకోదరవరపతిపద్దంతిపక్షీరనీరా। కరముక్తాహారకుందోత్కరరజతశరత్కాశసుదీప్యోతకీర్తి। శ్వరునాత్మారాము వాకేపదు వరగురు సర్వజ్ఞు నజ్ఞానదూరున్" అను పద్యము కాలాముఖమతమునకుఁ బ్రక్కనుండు జైనమతములో "హరహాసాకాశగంగాజలజలరుహనీహారనీహారధాత్రీ। ధరనీహారాంశుతారావనిధర శరదంభోధరక్షీరనీరా। కరకాశాఘారతీదిగ్గవనిరదనకీయూషదిండీరముక్తా। కరకుందేంద్రేభహంసోజ్జ్వలవిశదయశోవల్లభం శాంతినాథం" అని కొంచెముమార్పుతో నగపడుచున్నది. ఈ శాసనము త్రైలోక్యమల్లునికాలములోనిది. జైనకవులు శబ్దార్థ

చౌర్యమునకు వెనుదీయ రనుటకు సహస్రప్రయోగములు గలవు. జినసేనుని యాదిపురాణమున, "అపాంతరవ్యాపిషయా" "ద్వైపాద్వీపాంతరాత్" మొదలుగ భారవి శ్రీహర్ష బాణకాళిదాసమహాకవులనుండి పెక్కుభావములు గైకొనఁబడియె. వర్ధమానపురాణమున మహాకవి పసగుఁడు మాఘునిభావములు దొంగిలుకొనె; కాళిదాసుకంటె నాలుమడుఁగులు తాను మహాకవియని చెప్పుకొన్న పొన్నఁడు శాంతిపురాణమునఁ దమయంతీ స్వయంవరఘట్టమంతయుఁ గన్నడించుకొనియె. మఱియుఁ బూర్వకాలమున నిప్పటివలెఁ గాక రాజాస్థానములలో బహుభాషావేదులగు పండితు లుండిరి. భాషాంతరములలోని నూతనభావములఁ దమతమ భాషలలోకి నెక్కించుకొనుట వింతకాదు. కృష్ణరాయనిసభలోఁ దిమ్మణ్ణ తిక్కన భారతమునే కన్నడించెను. దేవరాయసభలో డిండిభట్టు సంస్కృతాంధ్రద్రవిడ కవియై యుండెను. రుద్రదేవునిసభకు మహాకవి కంబఁడు వచ్చియుండినట్లు తెలియుచున్నదిగదా.

ఐలిగ్రామకాలాముఖమతగురుపరంపర చూడఁబర్వతావళి గౌతమమునుని శిష్యవంశ మనియు నిందు శ్రీశైలవాసి గురులగు కాలాముఖులకుఁ బర్వతావళి యనునామము కాకతీయ శాసనములలోఁ ద్రిభువనమల్లరుద్రదేవ శాసనములఁగలని వచ్చుటయు నూహింపఁగాఁ గాలాముఖగురువులు మొదట శ్రీగిరి, యలంపురము ప్రాంతముల నుండి చోళరాజభటుల కులిక్కిన చాళుక్యరాజుల నాశ్రయించుటచే దక్షిణకేదార మగుఁ ఐలిగ్రామమున నెలకొనినట్లు నాకుఁ దోచుచున్నది. ఈ శైవ గురువు లెల్లరు మధురాప్రాంతములవా రనుటకు శాక్తేయరసవాద ప్రథమాచార్యులెల్లరు తద్దేశస్థులనుట తోచుచున్నది. కుంభజుఁడు తిరుకుత్తాల క్షేత్రమగు త్రికూటగిరిలో నింక నున్నాఁ డనుటయు నతని వస్నిరాయిర మను రసవాద శైవాగమగ్రంథము మంథానభైరవాది మహాసిద్ధులకు మూలమగుటయు సుప్రసిద్ధము. మల్లికార్జునుఁడు "కుంభజతత్త్వజ్ఞుఁ" డట. నన్నెచోడుఁడు రసవాదశాస్త్రమునఁజూపినపాండిత్యము రసరత్నసముచ్చయాదికృతులలోనిది కాక కేవలతచ్ఛాస్త్రాంతర్గతమైనది. "రసరసాయన నిర్ఝర ప్రవాహానూనగంగాప్రవాహాకరము లవల" ఇందుఁజంద్రోదక రసోదక విషోదకాదిరసాయనము లని యర్థము (చూడుఁడు రసార్ణవమున రసాయనఖండము). "ఇనుము రసంబులో నుడుగ కెప్పుడు మానినఁ గాని కాదె కాంచనము" అష్టాదశసంస్కారఘాత మానసమున ప్రపంచ మున వజ్రములలో సంస్కృతమైనది కావున

సీసము శబ్దాదివేధంచే బంగార మగునని రసరత్నాకరమున వాదఖండమునఁ జెప్పబడియె. "పరమౌషధిప్రభావానుగం బగుఁ గాని దుస్తృణజ్యోతి విద్యుతము గాదు" "పాచుఁ దమ మోషధీప్రభాభాతి" ఇంచుఁ దృణజ్యోతి మొదలగు లత లూహ్యములు. (చూ-కైలాస కారకమున దివ్యౌషధీ లక్షణములు). "పరుసవేదులఁ బొంది హరికాంతశిఖిఁ గ్రాఁగి కనకంబు లగునయస్కాంతశిలలు." వేధలు స్పర్శవేధ, ధూమవేధ, శబ్దవేధ, కుంతవేధ అని నాల్గువిధములు. స్పర్శమాత్రమున వేధించునది కావున స్పర్శవేధి. తామ్రశిలపై రసౌషధమును వత్తిలో గూర్చి వెలిఁగించినఁ దామ్రము బంగారమగుట ధూమవేధి. నోట రసౌషధము నుంచుకొని తప్తాయసతామ్రముల నినుపగొట్టములో నూదిఁనవేధించునది శబ్దవేధి. ఈ శాస్త్రమర్మముల నన్నెచోఁడు డక్కడక్కడ సూచించియున్నాఁడు. పైఁ జెప్పినయంశముల నన్నియుఁ గ్రోడీకరించి చూడఁగా నన్నెచోడుఁ డొరయూరి నేలుచున్నవాఁడనియుఁబాకనాటి నేలుచుండె కృష్ణాతటమున - క్రీ. శ. 902 లో శాసనములోఁ బేర్కొనఁబడిన చోడబల్లి కుమారుఁడనియు విక్రమకేసరి సంభావించిన మల్లికార్జునునకు శిష్యుఁడనియు వనవాసిదేశపుఁ జాళుక్య సామంతులతో యుద్ధముచేసి మృతిచెంది యుండవచ్చుననియు, మల్లికార్జునుఁడు కాలాముఖ మతస్థాపకుఁడు కావున నతని శిష్యపరంపరలో సోమేశ్వరుఁడు దక్షిణ కేదారమునకు మతము దరలించెననియుఁ, దరువాత నేకోరామి బసవపండితారాధ్య సోమనాథాదులవలన వీరశైవ మంకురించెననియు నామనస్సున కుద్బోధన మగుచున్నది. కుమారసంభవ కలావిలాసముల మొదట నథర్వణుఁడుదాహరించెను. పెద్దన, రామన, గణపవరపు వేంకటకవియు నీగ్రంథములలోనిపద్యము లుదాహరించిరి. మడికిసింగన, జగన్నాథకవి, ప్రబంధమణిభూషణకారుఁడు తమ పద్యసంచయములలో నన్నెచోడుని పద్యములు గైకొనిరి. జక్కన, కృష్ణకవి, తెన్నాలిరామలింగఁడు స్పష్టముగా భావచౌర్య మొనర్చిరి. నన్నెచోడుని యత్యుపూర్వభావములు మల్లినాథపురాణ జగన్నాథవిజయాది కర్ణాటక కావ్యములలో మార్పు లేక యున్నవి.వీనికృతులు కర్ణాటదేశమున వ్యాపించె ననుటకు సందియము లేదు. దక్షిణకేదారమున "హరిహరికమలాసనపీతరాగ బౌద్ధాలయం"బులు గలవు. పరస్పర మతగురుస్పర్థచేఁ దత్తద్భండారముల నన్యభాషాకృతులుండుటయు నాశ్చర్యము కాదు. కుమారసంభవ ప్రతులలో నొకటి నాకు నైజామురాష్ట్రమునఁ బ్రాచీనశాసనశోధనార్థము పోవుచుండఁగాఁ గర్ణాటదేశముననే లభించెను . తక్కినవి రెండును శుద్ధద్రవిడదేశముననే యగపడియె.

ఇఁక నన్నెచోడుఁడు నన్నియభట్టాదులకంటెఁ బ్రాచీనతముఁడని కుమార సంభవములోని వ్యాకరణఛందోవిశేషాపూర్వపదప్రయోగములు సహస్రముఖముల ఘోషించుచున్నవి. ఇతఁడు దీర్ఘముమీఁదియరసున్న నెఱసున్నగా వాడుకొనెను. "మూఁడుజగంబులకు దీప్రముగఁ బర్విన బ్రహ్మాండము కాంచినకాంచన ఖాంతము" ఇత్యాదులు పెక్కులు గలవు. ప్రాసములఁ గాక నడుమను సైతము దీర్ఘముమీఁదియరసున్న నెఱసున్నగా నుండుఁ గాని నేఁటికాలపుభాషావైశద్యము ననుసరించి యర్ధానుస్వారముగా ముద్రించితిని. ఇఱ్ఱె, తఱ్ఱు, మఱ్ఱు, మొదలగు రూపములు ప్రాకృతములుగా దీనిలోఁ బ్రాసస్థానములలోనే ప్రయోగింపఁబడియె. నన్నియకాలమునకె "తగ్గు" అనురూపము వికృతి చెందెను. "తగ్గు మ్రగ్గు" భారతప్రయోగములు నన్నియభట్టుభాగములోనే కలవు. చన్నెచోడనికాలమునకుఁ బిదపగూడఁ గన్నడమున "మఱ్ఱు" అనియె ప్రయోగింపఁబడుచుండెను. "విజయ ప్రారంభదోళ్ మఱ్ఱిపో దదటక్ష్మాపనికాయపుష్పకచయం వ్యోమైకసంకీర్ణకం"అని బలిగ్రామశాసనము. చోడని క్రొక్కారు, ఇక్క, క్రుక్కిదము, అక్కజము, త్రొక్కిన, ఒక్కడు, చొక్కు, ఉక్కటి, స్రుక్కిరి, క్రక్కిరి, నెక్కిరి, అక్కిలి, గ్రిక్కొని, కక్కెక్క, చొక్కి, తెక్కుల మొదలగు శబ్దములు గూడినప్రాసస్థానములు శోధింపఁగాఁ గొఱ్ఱారు, ఇఱ్ఱ, కుఱ్ఱిదము, అఱ్ఱజము, తొఱ్ఱిన, ఒఱ్ఱడు, చొఱ్ఱు, ఉఱ్ఱరి, సుఱ్ఱిరి, కఱ్ఱిరి, నెఱ్ఱిరి, వెఱ్ఱిరి, అఱ్ఱిలి, కిఱ్ఱొని, కఱ్ఱెఱ్ఱి, చొఱ్ఱి, తెఱ్ఱుల మొదలగు భాషాంతరరూపములు గలుగుటచే నట్టిపదములె ప్రాసముల వచ్చుటఁ జోడుఁడీప్రాచీనరూపములే యుపయోగించెనని తలఁచుచున్నాను. లేఖకులు నవీనరూపములు వ్రాసికొని ప్రాచీనరూపములు దోషము లని వర్ణించి యుందురు. "శా॥ ఆకొఱ్ఱారనురాజుమ్రోల నిజరావానంతగేయాభ్రభనా। దైకాతోద్యము" ఇత్యాది స్థలములఁ బ్రాసములలో రేఫాధిక్యము దోషము కాదని లాక్షణికు లంగీకరించిరి. ఏల? ప్రాచీనశబ్దములు కొఱ్ఱా రనియె యుండఁగా గాలక్రమమున భాష మాఱి క్రొక్కారయ్యె. అంతఁ బ్రాసవిరోధమునకు గతి యేమని రేఫసంయోగముచే దోషము లేదనిరి. ఇదియె దీనితత్త్వము.

నన్నెచోడుని క్రౌంచపదమున యతి విచిత్రముగా నున్నది.

"చంచల నాస్వాదించుచు లేఁదూండ్లకరువుప్రియలకు నలఁదుచు మైరో-
మాంచము లోలిం గంచుకెకంబై పొదమఁగ నడరుచుఁ బులినములం గ్రీ-
డించుచు సంభాషించుచుఁ బ్రీతిం బొలుచుచుఁ జెలఁగుచుఁ బొలయు సముద్యత్కాంచగతుల్ వీక్షించుచు భాస్వజ్జ్వలనుఁడు శరవణసరసికి వచ్చెన్.

ఇందుఁ గంపసీసములవలెఁ బ్రతిపాదము రెండుభాగములుగా విభజింపఁ బడి కందములవలెఁ బూర్వార్ధమునఁ బ్రాసము ద్వితీయార్ధమున విశ్రమము మాత్రమే కూర్పఁబడియె. ద్వితీయప్రాసనియతిమాత్రము నన్నియ తిక్కన కవి జనాశ్రయకారాది ప్రాచీనులు పాటించిరికాని యప్పకవి తన్మర్మము తెలియక వదలెను. తన్వి త్రిభంగి మొదలగు వృత్తములకును నీ నియమము కలదు. క్రౌంచపదము మాత్రాఛందమునఁ బడి శీర్షక మగును. ఎటన రెండవ, నాల్గవ, గణముల నాల్గుమాత్రలుగా నుచ్చరించి కడపటి గురువు ద్రోచివైచి పూర్వ గురువు రెండుమాత్రలుగాఁ బలికిన సీస మగును. ఇట్లే తన్వీక్రౌంచపదములలో నుండి వృషజాతిశీర్షకము పుట్టె నని నందిభరతమునఁ జెప్పఁబడియె. రెండవ పాదము "మాంచములోలిగఁ గంచుకితం బయి పౌడమఁగ నచరుచుఁ బులినము లను" అను సీసపాదమగును. ఇందుఁ బూర్వార్ధమునఁ బ్రాసయతియు, నుత్తరార్ధమున విశ్రమమును గలదు ఇట్టి నియమములుగల సీసములు నన్నియభట్టు భాగములోఁ బెక్కులు గలవు. ద్రవిడభాషలోఁ దిరువాయ్మొళ్ళి యను మహా ప్రబంధమున సీసము ననుకరించుపద్యములలోఁ బ్రాసయతియే కలదు. అట్టిదే ప్రాసనియత సీసములు నన్నియ ప్రయోగించెను. నన్నియకాలమునకే క్రౌంచ పదము వృత్తము కావునఁ బ్రథమాక్షరవిరతి ముఖ్యమని ప్రాసమున్నను రెండు విరమస్థానములు ప్రయోగించిరి. ఇది నన్నెచోడుని ప్రాచీనత కొక గొప్ప కారణము. చోడునిచక్రబంధమునఁ గృతికృతికర్తృపతినామములు గుప్తములుగా లేవు. ఈ విధముగానే కన్నడమునఁ గవిరాజమార్గ మను ప్రాచీనతమ కావ్యములో నీనియతి కానరాదు. ఈ మర్యాద యిటీవలఁ బుట్టెనని తోచు చున్నది. చోడుఁడు "సప్రాణంబై నవరసభావభరితంబై షట్త్రింశదలంకారాలంకృతంబై" అని కుమారసంభవమునఁ జెప్పుటచే నతని కాలమున నలంకారములు ముప్పదియా రనియే చెప్పఁబడియె. భామహాది ప్రాచీను లలంకారములు ముప్పదియా రనిరి. దండి, విద్యానాథ, విద్యాధర, మమ్మట, జయదేవ, దర్పణకార, పండితరాయాదులు బహుభేదములుగాఁ బ్రపంచించిరి.

ఇఁక శబ్దవిషయమున దీనిలో వాడిన పెక్కుపదములు భాషలో నశించెను. ఆంధ్ర ద్రవిడ కర్ణాటాదులు సోదరీభాషలగుటచే నొకదానిలో నస్తమించిన వేఱొకట నిలుచుట సంభవించుటచేఁ బెక్కుపదములను ద్రవిడకర్ణాటకములఁ బ్రాచీన ప్రామాణిక కృతులలోనుండి ప్రయోగములు చూపితిని. కొందఱు

తద్భాషాపాటవము లేక నన్నెచోడుఁడు కన్నడములోనుండి శబ్దములు దొంగలించె నని పాండిత్యవైచిత్రి చూపెదరు. దేశ్యపదము లన్నియు మూఁడుభాషలలోను గలవు. నే నపూర్వపదములకుఁ బ్రయోగము లిచ్చితిఁ గాని తిక్కన శంభుదాసాదుల పదములకు నవీనకర్ణాటకమున నుండి చెవులు చిల్లులువోవునన్ని ప్రయోగసహస్రములు చూపెదను. వీరెల్లరు కన్నడమునుండి దొంగలింప వలయునా? భాషలలో నివి సామాన్యదేశ్యపదములు. మఱియు విస్మృతపదముల మాట యట్లుండఁగా భాషలో మహాకవిముఖమున నవతరించిన పదములలో సైతము చోడనియర్థము శబ్దోత్పత్తికి దగ్గఱించి యున్నది కాని తిక్కనకవుల యర్థము లక్ష్యకోటిలో నంతరాంతరితమై భిన్నార్థము నాశ్రయించుచున్నది. ఆలుశబ్ద మిందు స్త్రీపర్యాయముగాఁ బ్రయోగింపఁ బడియె. ఇల్లాలు, మగనాలు, జవరాలు మొదలగు వానిలో నాలు ప్రత్యయ మయ్యె. ఇప్పుడు భార్యార్థమున వర్తించుచున్నది. కంపుశబ్దము "కమ్మ్" అను మూలమునుండి "కమ్మ" యను గుణవాచకమై "కంపు" అను తద్ధితమై సుగంధార్థముననే వర్తించు చుండెను. నన్నియకాలమున నుభయవిధ గంధార్థమున వర్తించి నేఁడు దుర్గంధముననే చెల్లుచున్నది. తనుపారు = చల్లనగు. ఈ యర్థము మాఱి తృప్తిగా నను నర్థము కలిగెను. ఓడు = పాఱిపోవు (పూర్వార్థము) = అపజితుఁడగు — లక్షణార్థము. "పట్టోడినపెల్లో" ఇత్యాదులఁ బూర్వార్థములోనే వాడఁబడియున్నది. కలిమి = ఉండుట. సంపద యని మాఱెను. ఇట్లే దీనిలో శబ్దశోధనము నేసిన నవి ప్రాచీనరూపములై లక్షణ నాశ్రయింపక మూలార్థమునే యావహించు చుండును. నన్నియాదికృతులలోని విచిత్రవ్యాకరణప్రయోగములఁ దరువాతి లాక్షణికులును గవులును వదలిపెట్టిరి; లేక నూతనసూత్రములు గూర్చిరి. నేని యనుశబ్దము, అన్న్, పువమేశ-ఇత్యాది విచిత్రప్రయోగములు భాషాంతరములోను ప్రాచీనకృతులలో నగపడుటచే నది తత్తచ్ఛబ్దములలోని విశేష మని యూహింపఁదగుఁ గాని సర్వస్థలముల నీ యనుశాసనము చెల్లదని యేర్పడినది. "తెమ్మరల్" మొదలగుచోట్ల తెం = దక్షిణపు, ఎరల్, లేక, ఎలర్ అనఁగా గాలి-అని తెమ్మెరల్ మలయమారుతార్థములోఁ బ్రాచీనులు లాంతముగానేకవచనముగాఁ బ్రయోగించిరి. తద్భావ మెఱుంగక బహువచన భ్రాంతిచేఁ దెమ్మెర యని నవీనరూప మేర్పడియె. పెసర్ (ధాన్యవిశేషము), ఇరుల్ (చీకటి), మరల్ (వెఱ్ఱి), తిరల్ (తిరుగుడు), ఎలం (బాల్యము), పసుం (లేఁత), తలిర్, చిగుర్, అలర్ (మిత్తి), పదర్, తడం (త్రాసు) మొదలగు పదములు

హలంతములు కావున సంధిలోఁ దదనుగుణవికారములు చెందుచుండును. ఇట్లు శబ్దశక్తివిశేషములు శోధింపఁగా నితఁడు తప్పక ప్రాచీనుఁ డని యేర్పడును.

నన్నెచోళుఁడు తనతండ్రి పాకనాటిలో రాజ్యము సేయుచుండఁ దానొరయూరేలుచుండెనట్లు తెలుపుచున్నాఁడు. తెంకణాదిత్యుఁ డనఁగా దక్షిణదిశాసూర్యుఁడు. ఇతఁడు దక్షిణదిశ జయించి యీ పేరు గైకొనెనో లేక యితని పూర్వులు సహితము వహించిరో తెలియరాదు. పరాంతకుఁ డొరయూరు పట్టు కొనుటకుఁ బూర్వమే కుమారసంభవము రచింపఁబడెనో లేక పరాంతకుని నన్నెచోళుఁ డోడించి రాజ్యమును గైకొనెనో స్పష్టము కాదు. పులకేశిహర్షవర్ధనాదులు పరాజితులు గాలేదా.

ఈ కుమారసంభవము నన్నెచోడుఁడు గాక తదాస్థానకవియెవ్వడైనను రచించియుండు ననుచు కొంద అందరు. ఎవ్వఁడైనను విరచించినవాఁడు తప్పక మహాకవి. కవి యవతారికలో "అన్యకారకవితతు లనాదరించి। వెలయసత్కవి బుధ గురుబలమువడసి। యొనరదైవజ్ఞు నట్ల శుభోదయమున। దివ్యసుకృతిఁ బ్రతిష్ఠించుఁ దిరముగాఁగ." అను పద్యములో "నన్యకారక" అనఁగా శుభేతర గ్రహములు. వితతులనుటకు వికృతులని యుండుటయొప్పు. "అశుభగ్రహ వికారముల ననాదరించి" యని యర్థము. అర్థాంతరమున, అన్యుఁడగు తారుఁ డనుకవి యొక్క కృతుల నని యర్థము ద్యోతకము. ఇట్టి తారకపినామము 518వ పద్యములో మరల శ్లేషార్థమున వచ్చుచున్నది. వీఁడెవ్వఁడో యెఱుఁగ రాదు.

ఒకవేళ మనకవి ప్రాచీనుఁడు కాఁడనియైనేని కొంతఱ యేమి? నన్నియాదులకుఁ బూర్వకావ్యములు రాజప్రోక్తములే వెలువడ నున్నవి. కావున నా వాదములమాట యటుంచ నిండు. రత్నము లెందు నెవ్వడు సృష్టినేమి? చవులు గలవేని రాజభోగ్యము లగుఁగదా! సర్వవిధముల నిరుపమాన మగు నీ కావ్యరత్నము కవి యెవ్వఁడైన నెప్పు డుంచినను సర్వజనాదరణీయమే. "వక్తుః ప్రామాణ్యతో దేవ వచః ప్రామాణ్య మిష్యతే। న హ్యశుద్ధతరా ద్వక్తుః ప్రభవం త్యుజ్జ్వలాగిరః" అని జినసేనుఁడు చెప్పినట్లు వజ్రములుండుపులు బొగ్గలలోఁ బుట్టునా? అల్పజ్ఞుఁడగు నాయట్టివాఁ డజ్ఞానముచేత లేఖకదోషముల గుర్తించి ముద్రింపఁజాలకున్నను గేవలము తాళపత్రములలోని పఠనక్రమమును

బోఁగొట్టి దీని సర్వజనహస్తగతము చేసినందుకే యించుక సంతోషింతురుగాక. భాషలోఁ గతిపయాక్షరజ్ఞానము సంపాదించిన ఋణము నిమ్మహాకవి కీర్తిపునః ప్రకటనముచేఁ జాచికొనఁ గలిగితిఁగదా యదియ చాలు నని పరమానందమునఁ బొందుచున్నాఁడను.

చెన్నపట్టణము. మా-రామకృష్ణకవి.
౩౦ ఆగష్టు ౧౯౧౪.

---

శ్రీ

# ప్రాచీన శబ్దానుశాసనక్రమము

క. వ్యవహారాచారాదుల నవనవతయ కోరునూత్ననాగరకుల నీ-
నవసూత్రప్రాచీనాంధ్రవచో వ్యాకరణ మెంత నవ్వించునొకో.

1. సూత్రము.

భాషలో శబ్దములు ప్రాయశః హలంతములు. ద్విత్వములు తక్క హల్సంయుక్తాక్షరములు లేవు. పరస్థఋకారసదృశరేఫము వ్యతిపాతవిధిఁచే (Metathesis) పూర్వాక్షర సంయుక్తి చెందు. హలంతముల కభావము పరమైనచో నికారోకారము లాఁతగా నగు. అనునాసికాంతముల కాఁతగా నుకారము వచ్చునప్పుడు తత్తద్వర్గ తృతీయాక్షర మాఁతగా నాగమ మగు.

మలజ్, కాజ్, నలజ్, రాముజ్, వేఙ్, అలన్, పమ్, గాలామ్, వలమ్, ఎదమ్, ఏమ్, వరమ్, చేయ్, కమర్, నుమర్, అలర్, ఎలర్, కుఱల్, ఇఱల్, లనప్, నేర్, వర్, తేర్, తోర్, మొదలగునవి హలంతములు.

తల్లి ప్రభృతులు ద్విత్వములు. వ్యతిపాత రేఫ సంయోగమునకు; పఱమ్ (ప్రాఁతది) ప్రాఁ. వఱచు = వచ్చు—రేఫలోపము. కొఱ్ × త - క్రొత్త. కిఱ్ × కొను = క్రిక్కొను. కుఱ్ × కిదముగ (కుఱుచ - దగ్గఱించు) = క్రుక్కిదము = దట్టము. కఱ్కు = క్రక్కు, ఈ రేఫము కొన్నిచోట్ల లోపించును. అఱ్ × కిలి = అఱ్కిలి. అక్కిలి. నేర్ + చు = నేర్చు, నేచు. తోర్ + చు =

తోర్చు (ప్రాచీనరూపము), తోచు. తోర్ = ఆగపడు. తోచు = అగపఱుచు. త్రోవ = అగపఱుపునది (రకారవ్యతిపాతము); కుదుర్, అలర్ — ప్రభృతి హలంతములు కూఁతగా నుకారము రాఁగా కుదురు, అలరు, అలవు — అలవి, తనివి — తనివు — మొదలుగానయ్యె.—

మలజ్, కాజ్! పరఞ్, వేణ్, రాముణ్, అలన్, పమ్మ్ మొదలగు ననునాసికముల కూఁతగా నుకారము పరమై వర్గతృతీయాక్షర మూఁతగా రాఁగా, మలఁగు, కాఁగు, పరఁజు, వేఁడు, రాముఁడు, అలఁదు, పంబు, గారాఁబు, గాలాఁబు, వనఁబు, ఛత్రఁబు, చామరఁబు, మొదలగురూపము లేర్పడియె. వనము, ఛత్రము — మొదలగు మువర్ణకాగమము ప్రాచీనభాషలోఁ గానరాదు. వనఁబు లనియె చెప్పనొప్పు. ఇట్లె వలమ్ = కుడి. వలఁబురి = దక్షిణావర్త శంఖము. (పురి యనఁగాఁ జుట్టికొనినది.) వలమురి — దుష్టరూపము.

3. ఇ ఉడలకు లఘుత్వగురుత్వములు గలవు. చజలు నిత్యదంత్యములు. ఊఁతగా నగునికారోకారములు లఘువులు. ప్రాచీనతరభాషలోని ఴ కారమునకు మాఱువచ్చు డకారము లఘువు. పాడు, కడుపు, పొడము, కోడి, ఏడు — మొదలగువాని డకారములు లఘువులు. ప్రాచీన శాసనములలో లఘు గురు డకారములకుఁ బ్రత్యేకాకృతులు గలవు. చేసి, చీమ, యిత్యాదుల చకారము సైతము దంత్యము కావుననె ప్రథమమీఁదను యాంతముల మీఁదను సకారమయ్యె. చేయ్ + చెన్ = చేసెన్. మలయ్ + చెన్ = మలసెన్.

4. పదములకు సంధిలేదు.

అతఁడిచ్చెఁ మొదలగుచోట్ల లఘూకారాగమము రాకుండెఁ గాని వచ్చి లోపము పొంద దయ్యె. ఏమ్, అద్, మఱ్, మొదలగుచోట్లు హలంతములు కావునఁ బరమగు స్వరముతో నూఁడుకొనియె. ఇందికారము లఘువుగాన పరమైన నాగమము రాఁజాలదు. పొలసాడు మొదలగుచోట్లఁ బొలయ్ + చు = పొలసు = పొలసాడి

క్త్వార్థకేకారము భాషలోఁ బ్రయోగబాహుళ్యమున గురు వయ్యెఁ గాని ప్రాచీన తమభాషలో లఘువే యై యుండును.

5. అనునాసికాంతములం బ్రత్యయ శబ్దపర్వతములచే ననునాసికములు లోపించినచో నర్ధోచ్చారణము వికల్పముగా నగు; అధునాతనభాషలో నర్ధానుస్వార మగు.

మలజ్ × ఉ = మలఁగు. (ఇందు గకారాగమమై తేలఁబలికిన జ్‌కు నర్థోచ్చారణమయ్యె. ఊఁడిపలికిన మలంగు అని యయ్యె.) కాజ్ = కాఁగు. డాజ్ = డాఁగు.

6. ధాతువులు హలంతములును బ్రథమాంతములును నగు. తుమున్నంతములు సప్తమి. వర్ (వచ్చు), చేయు, కొట్టు, కదలు, మునుకు, ముసురు మొదలగు సమస్త ధాతువులు ప్రథమాంతములు. చేయన్ = చేయుటయందు. కొట్టంబడియె = కొట్టుటయందు మునిఁగిపోయెను. (భాషలో నెందును గర్మణి ప్రయోగము లేదు. తినఁబడియె = తినుటలోఁబడియె)

7. మల జాదిధాతువుల జకారమునకు యకారాదేశము వైకల్పికముగా నగు. ఉదా: — మలఁగు — మలయు, వెలుఁగు — వెలియు, నలఁగు — నలయు, డాఁగు — డాయు, అడయు — అడఁగు, మునియు — మునుఁగు (నష్టమయ్యె), కాఁగు — కాయు, చెలఁగు — చెలయు. మొద.

8. అడ జాదుల ప్రథమాచ్చునకు వ్యతిపాత మగు. అడఁగు — డాఁగు, అడయు — డాయు, అరయు — రాయు, అలయు — లాయు, అవియు — వేయు, (నష్టము) — వేఁగు, ఎలయు — లేయు, ఒరలు — రోలు, ఒజలు — జోలు, ఒరయు — రోయు, మొదలగునవి.

9. భూతార్థక విశేషణమగు ఇనప్రత్యయము "ఇత" తద్భవము. పడిన - పతిత, చేసిత + ఎఱ్ (చేసినట్టినేను) = చేసితిఱ్. (చేసితెఱ్ - ప్రాచీనతరరూపము)

10. ఇఱ్ — ఎఱ్ — ఇవి, ఎఱ్ అఱ్ ప్రాచీనతరరూపము, ఆ, ఆల్, అఱ్ ప్రభృతి ప్రత్యయములు సర్వనామ వికారములు.

11. విభక్తులు మూఁడె. ప్రథమాద్వితీయాషష్ఠులె. తదితరవిభక్తి ప్రత్యయములు సంస్కృత విభక్త్యర్థవాచకములు షష్ఠిపైనవచ్చును.

రామునిచేత = రాముని యొక్క హస్తమువలన. తోడ = తోడునందు, కొఱకు = తక్కువకు. (రామునికొఱకు = రాముని తక్కువకు నని యర్థము.) కై = కు + అయి. వలన + మార్గముగా. కంటెఱ్ — కంటఱ్ — ప్రాచీన రూపము. కొనుటయందు—అని యర్థము.

12. కొన్నిచోట్లఁగవలకును నరలకు నభేదములు. కురుల్ = చురుల్ = చుట్టలు – (ద్రవిడభాష) పనఁడు – పరఁడు, అనఁడు - అరఁడు - అప్రత్యయ గవాంతములకు వకారమునగు, మూగు – మూవు, నెగులు – నెవులు, మొద.

13. అల్లనప్రభృతుల యంత్యాచ్చేవార్థకమె. కాన (కాఁ × అ = అగు చుండఁగానే)

14. తీఁగాద్యులకార మకారమ కాక యెత్వము కాదు. తీగ, సరిపణ, మురిపము, తిరిపము, గజ్జ, వీణ ఇత్యాదులకు నియాదేశము రాదు.

15. లఘూకార, సంయుక్తరేఫ లఘుడకారములకు సంయోగమున లోపసవర్ణత్వాది వికారము బహుళము. చిలుక – పూర్వరూపము చిఌక, చిల్ (భాషాంతరములఁగిళ్), + ఇలేకడ = చిలి, చిలు; స్వార్థమునఁ గకారము. చిఌక ఉకార మూఁదఁగా జిలుక. (ఇట్లె పదాంతములమీఁదిలఘూకారేకారములకుఁ బ్రత్యయములు పరంబగునపుడె యచ్చు లోపంబగు. లఘుడకారము మీఁది యచ్చునకులోప మగు కడుపు, పొడము మొ. కడుపు ప్రాచీనధాతువు - కఴ = త్రోచివైచుట. పువర్ణకము కృదంతము. కడ్ + పు - ప్రాచీనరూపము వైకల్పికముగాఁగడుపునగు)

16. రేఫాదిసంయోగముల లఘూచ్చారణ మగు.

17. ముందఱు ప్రభృతులు హలంతములు – ముందఱ యన సప్తమి,

18. తెలాదులు లకారాంతములు; గుణవాచక మగుచో నికారాగమ మగు. తెలి, వెలి, పలి, పలినాడు మొ. తెలాదులకు ద్విత్వలకారమునగు. తెల్ల, నల్ల, వెల్ల, చల్ల, పల్ల, పల్లనాడు, పల్లవెంద్రుకలు. తెలాదులఁదద్ధితమునఁబువర్ణాగమ మగు. తెల్ + పు, నల్ + పు — చల్ + పు. ఉకారాగమము నవీనరూపము. తెల్పు, తెలుపు, వెల్పు, వెలుపు - మొద.

19. మలజ్ ప్రభృతుల ప్రేరణార్థమునఁ జుకారాగమము పరమగునపుడుచ్చారణార్థక వర్ణతృతీయాక్షరాగమము రాదు. మలజ్ చు = మలఁచు

20. ధాతువులకు భావార్థకమున "ఉడ్" ఆగమ మగు. ఇందు డకారము లఘువు. చేయి × ఉడ్ = చేయుడ్ (ప్రాచీనరూపము). చేయుడు. (ఉకార మూఁదిన రూపము. ఇది సప్తమిలోఁ జేయుటయగుట. ఇదియ నేఁటిభాషలోఁ బ్రథమావిభక్తిరూప మయ్యె.)

21. తాఁకుప్రభృతి ధాతువులకుఁ బూర్వరూపములు తన్కు, తనుకు. అంటాఁక = అది తాఁకుపడక.

22. రేఫశ్లిష్టహల్వర్ణమునకు నధునాతనభాషలో రేఫలోప మగుచో నుపధాక్షరము హ్రస్వమగునేని సంయుక్తహల్లునకు ద్విత్వమగు. ఉర్కు — ఉక్కు, నెఱ్కు — నెక్కు (సమీపించు) ప్రొర్కు — త్రొక్కు, ఒర్కఁడు — ఒక్కఁడు (ఒర్ = ఒక) ఏర్కి — ఎక్కి (ఏఱ్ = ఎక్కుట.) కిఱ్కొన = క్రిక్కొన (కిఱ = దగ్గఱించు.) కర్కెర్కి = క్రక్కెక్కి, సుర్కిరి = స్రుక్కిరి (సురుగు = శుష్కించు. సురుకు ప్రాచీనరూపము). కర్కిరి — క్రక్కిరి. వెర్కిరి = వెక్కిరి (వెలిలోని లకారము రకారమయ్యె). నిర్కెడు — నిక్కెడు (నిఱుకు - లేచినిలుచుట). నొర్కుడు—నొక్కుడు. (నొఱుకు - నుఱుకు - నుఱుగుడుపు). [నన్నెచోడుఁడు రకారయుక్తముగానే ప్రయోగించి యుండుననిగ్రంథశోధన వలనఁ దెలియుచున్నది.]

---

## శ్రీ

## లఘుటీక

ఇందు శబ్దరత్నాకరాది నిఘంటుస్థములు కాని ప్రాచీనశబ్దములకు నర్థాంతరముగల శబ్దములకును భాషాంతరప్రయోగముల ననుసరించియు సందర్భోచితముగాను నర్థము వ్రాయఁబడును. దీనిలో నుద్ధృతమగుసంఖ్య రెండవభాగములోని పద్యములసంఖ్యను దెలుపును. 4. కన్నెఱింగి = జాడఁదెలిసి. "ఎంతకన్నెఱుఁగనియెలనాగిమోహల" ఉప. ఆ. ౨. ౫౮. 6. తప్పఁజూచు = నిర్దయముగాఁ జూచెడు. పలువడుతు = అలయుట. 7. నెఱి = పరిపూర్ణత. 8. సావి = సవి = అనిశ్రమతో. 9. నెవ్వలు = చలించు. వెల్తురుతీగలు = జ్యోతిర్లతలు. పూర్ణిమారాత్రులందే యిటునటు పొలయుచు వెలుఁగుచుండెడులతలు. కంపు = కమ్మనివాసన. తెమ్మెరలు (తెం + ఎరల్) దక్షిణపుగాలి. ఇది యేకవచనము. తెమ్మెర యనురూపమసాధువు. 10. దివ్యాహారము = అమృతము. 11. మెలుపు = సౌకుమార్యము. 12. వంకోట = ప్రేమయనుమర్గమున. దొరయు = సమానము. "కావునకాల్వదొరె" గదా. ఆ ౧ ౯.

గెవలౌ (కెవలో) - సహచరులౌ. 16. ముంచఱు = పురోవృష్టి. ఢింపము (ఢేపము) - విఱుగుట. దేసి = అందము. 18. లక్తకా = లత్తుక. 19. ఆరోహిణ్యవరోహిణులంబై నీసనుస నంగవర్తనము సేయఁబడియె. తావగొనక = నిల్పోపక. "వారణసేయఁ దావగొనవా" శ్రీనాథునిసప్తశతి. "తల్లడంబునం దావగొనంగ లేక"; నిర్వ- ఆ - ౮. 22. సురగజ్జెలు = మ్రోయుచున్నమువ్వలు. ఘర్ఘరములు = గజ్జెలు.

25. ఆయగంబు = చప్పరము

34. పొందులు సంగతులు. 36. జల్లితొంగళ్ళు = కుచ్చులు కట్టిన చిన్నగొడుగులు, 42. వాతపూరణములు గాలితో నింపి తలగడలవలె సౌధాగ్రముల ప్రేలాడఁ గట్టఁబడినధ్వజవిశేషములు. "వాతపూరణంగళిం నొందంతె దెసె దెసెగె పొంగువగొగెగళిం" శూద్రకము. కలువడగలు = కలివడగలు = వీరధ్వజములు. (కలి = శూరుడు. పడగ = ధ్వజము). 50. పూరణ = అలంకారము. 52. పోల్చిచూడుఁడు. "సరభసలీలఁగేళిసితసౌధము లొక్కట నిర్గమించి చ । ల్లిరి నరనాథుమీఁదఁ బురిలేమలు లాజలు దోయిలించి చె । చ్చెర శరదంబువాహములు చించి బయల్వడు చంచలాలతల్ । పరిమితవృష్టి బిందువులఁ బర్వతరాజముఁ గప్పునాకృతిఁ" ఉదయ. ఆ. ౫.

56. ఒప్పము = ఒప్పు. "విలాసమం మెఱసి దప్పుపెసల్తొడ వాకె గొప్పమంపడె పెడగల్ల వావధుగె మంగళకారణ మత్తెభూషణం" పంపరామా- ౫-౧౪౦. 59. దువ్వలువు సన్నవలిపము. 61. తని + వోవు = తృప్తియగు. తని, తనివి, తనివు —రూపభేదములు. 64. కొప్పు = కానె.

65. నిర్వాణము = మోక్షము, నగ్నత. "పగలఁ బొగిలెడివాని నిర్వాణినొక్కట తరుణతాపసి" దశ. ఆ. ౫. 66. వెలిమిడి = విభూతి. చెలువంగ = పూయఁగ. వలగొంత = కుడిభాగమునఁ గొంత. మడఁది = స్త్రీ, "మడదియరమొలెయ నల్లదొడుడియదె" లీలావతి. 81. పాల్ = భాగము. కల్లడి = పొంగు 83. లగ్గ = పూర్ణముగా. "లగ్గ బెగ్గలించు నగ్గలముగ" భార - విరా. 87. పోఁక = సంధ్యాకాలము (వేగుఁబోఁక = ఉదయసంధ్య.) 91. ఒడఁగూడి రాకకు = సమ్మేళించివచ్చుటకు. 95. వెఱుఁ దెక్కిన = వెనుకకుఁజిక్కిన. 99. కప్పిపిన = పూసిన. 101. నన్నలువాఱ = (కరచరణాది) సంస్పర్శ సేయఁగ,

"ఒఱపరిఁ గన్నఁ గూడఁ జనుసూరక నన్నలువాఱ నాకు....... జారధారు ణిఁ" జై. ఆ-3. చప్పరించుచు = తడవుచు. "నీ నిల్లిం తొలగెందు చప్పరి సిదం మంతోవరీదేవియం" పంపరామా - ౧౪. ౧౩౩. 102 కూర్చువారికి = ప్రేమించువారికి. 105 వెల్పు = తెల్లదనము. "లలిత వళిత్రయం కిడదె బెళ్పు ముఘాళ్ళిహొళ్" అజితపురాణములోని గర్భవర్ణనము. 103 మేలిల్లు = శ్రేష్ఠమగు చున్న. 110 గొడగు—గొడుగు రూపాంతరము. "కు డై" యని ద్రవిడమున వాడుదురు కానఁగొడగు లనుటయే ప్రాచీనరూపము. 112 పాళియ = తట్టు. 116 మెయికఱ = దేహములోని నలుపు (కళంకము). 118 దీని పోలికగల రెండుపద్యములు పూర్వభాగము పీఠికానుబంధములలో నుదాహరింపఁబడినవి. 120 పట్టించిరొ = ప్రారంభింపనూక్షొలిపిరొ. "మంచన వింటివో వినవో మన్మథుఁడేకశిలాపురంబులోఁ। జంచల నేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రిపో। రించి ప్రభాతకాలము పరిస్ఫుటమైనను దమ్ముఁ దార ప। ట్టించుచునున్న వాఁడదె కుటీగత కుక్కుటకంఠకాహళిన్" శ్రీనాథునిక్రీడాభిరామము. 124 మూరి = చిత్తవిభ్రమముతో. నూరెలువాఱు = పార్శ్వముల కొదుగుచుండె. 129. పొయిగారము = కరువు 130 మిగిలి = అతిక్రమించి.

136 దాఁపరము = దాఁచి యుంచుటలు. కట్టుదాల్పు = కట్టుత్రాడు వేను టకు. రా = రాతిలో. గంటు = గాయము. కలి = గంజి. కత్తిగొంటులు = కటారికత్తెలు. అత్తగంతు = లంజతల్లులసంస్థ. "నేలయు నింగియుఁ దాల ముల్ గావించి" పిరా - ఆ - ౨ "నేలకు మింటికిన్దొవరి నేర్పున సూత్రము వన్న మంచఁ గుం। చాలను గొల్వఁద్రాక్కొనుక చాలునఁబేనఁగఁ జుక్కలెన్నఁ జ। క్రాలను నారలొల్చి నెగడన్ వడగంట్లను గుట్ల గట్టిఁగాఁ। బోలినమేకు నిచ్చ జికి సంయమి దెచ్చుట యేమిసోద్యమే. రఘు - రామా. ఆ - ౨. 137 అల్లురు = విటులు. 138 తక్షోపక = త్రోచిపుచ్చుట సహింపఁజాలక. కను వలి = సంకోచము. 139 ఒడ్డించి = ప్రయత్నించి. అలములు = కలహములు. 140 పురులు = ధనము, పట్టణములు, వేషములు, ద్రవ్యము. 141 తలపిండ్లు = తలవాఁకిండ్లు. రేసంబు = వ్యాజము = దంభక్రియ 142 కలువక = ప్రేమింపక. పురులు = ధనము. పొచ్చువోక = హైన్యముపడక. 143 కోర = వ్రక్కలుముడిచిన. మగలంజెయలు = లంజలవలె మాయాయౌవనచిహ్నముల ధరించిన మగవారు. కాలియాలు = వేశ్య.( = స్త్రీ). రోలుగొన = జల్పములాడ,

పాంచాలదేశస్థుడగు బాభ్రవీయుఁడు సాంప్రయోగికమున ననురాగవ్యూహోపచార రసానుభవమునె ప్రతిపాదించెను.

దత్తకుఁడు = కేరళదేశపు రతిశాస్త్రజ్ఞుఁడు వైశికాధ్యాయము రచించి యందు వేశ్యానురాగచర్యలు నాయకునియూవి కనుగుణముగానుండుసుగాక యని యాదేశించెను. కూచిమారుఁడు కూచిమారతంత్రమున మూఁడుపటలములలో మంత్రౌషధాద్యోపనిషద ప్రకరణమునే పేలుగాఁజెప్పెను. భద్రాదులు నలుపురును నాయకులుగా గ్రహించుకొనఁదగు. బేటంబు = అనురాగము. కలుచు = ప్రేమించు.

పోల్చిచూడుఁడు. "నిజరూపరేఖల నెలఁతల వంచించునాతురి గలభద్రజాతివిటులు । పలసినధనము లవ్వారిగా నొసఁగుచుఁదరుణులఁ గరఁగించుదత్త విటులు । మణిమంత్రములచేత నబుమధ్యలఁ గరంచుమగటిమి గలకూచిమార విటులు । పలరాజుకళ లుండు సెలవుల భేదించి సతులఁ దేలించుపాంచాల విటులు । వరుస నందఱు తమజాతివారి వారి । జాతవచనలఁ గూడి సంజాత మదన । కదనకేళివిహార సంపదలఁ బొదలి । మెదలుదురు వీటనధికసమ్మదము లొదవ." కష్ణవిలాసము ఆ - ౧. 147 సెగ్గించెకా = రోతపడెను. 148. ఉరి = మంట.

151 అండురు = స్త్రీలు "స్త్రీలను బ్రేమింతురా ? మఱుగు లేక నిన్నుఁ బ్రేమించుటయే దోషమని కోపించెదవు. స్త్రీ నాయకుఁడు మ్రొక్కినను గోపమును దేర్చుకొనఁజాలదు., అట్టిది దైన్యముతో మ్రొక్కుటయు కాక నిన్ను బతిమాలి సేవించుచుండఁగాఁ బ్రియపై నిట్లు వక్రత్వము చూపుట నీకుఁదగునా." అండురనుటకు "మలయాచలంబుపైఁ జిలువయిల్లాండురఫణరత్నములయందుఁ బ్రతిఫలించి" కాశీ. ఆ-౧. "అసమునందుబునకా మగనియాండురు గన్యలు" నిర్వ ఆ ౫.

153. అంచు = అఱచును. 155 తక్కిన = వదలినయెడల. పురుడువారి = సమప్రేమగలవారి. ఎడయైన = ఎడఁబాటు గలిగినపుడు. మట్టు = మందమగుచున్న. 156. విటవిదూషకాదులు క్రమముగాఁ జతురోక్తి పరిహాసోక్త్యాదులు భాషించుచుండెరి. 157 తనువు = చల్లఁదనము. తెలివు = తేట. 158. కంపు = మంచివాసన. "కంపు గొనకయె కల్పవృక్షములపుష్ప। సౌరభం బిట్టి దని చెప్పఁ జాలువారు, కేతన. "పూవులకంపు మూర్కొనక" అర్థ.

159. రిమ్ములు = రెమ్మలు = ఉపశాఖలలోఁ. చేవెఱ = లజ్జ. 160 ఒట్టియ = ఒంటె. 162. "ఇంకెడుపంకమధ్యమున నెంతఁ దలంకెడుమీను కోలె నే;కాంకని ఘాస్యయుండెఁ దలిరాకులఁ జేసెనహెూప్పుడై" ఉ-ఆ-౨. 163. "ధనాసక్తిచే వలచుట హరిద్రారాగమువలెఁ ద్వరలో మాసిపోవును. విటుఁడు విరాగి యైనను నిర్వ్యాజరతసంపద గలదేని రసభావము లుద్దీపించు చుండును." 164 కాన్పు = కనుట = పొందుట. "ఇది కలరోసికాన్పు" హరి-ఉత్తరభాగము. 165. నిజము = స్థితి. కలవాఁక = సర్వకాలము. కలుపు = ప్రేమ. 166. వలను = చాతుర్యము. "చతురత్వమును రూపమును విద్యయుఁ గల స్త్రీఁ బురుషుండు దన్నుఁ బ్రేమించునట్లు నడచుకొని తాను బ్రేమించెనేని వానికిఁ గామసుఖము సంపూర్ణమగు."క. "తను వలచుకాంత; యేపని మనమునఁ దలఁచినను జేయుమగవానికి న; ప్పనిత బిగికౌఁగిలి; దినదినమును మదన కామధేనువు గాదే" ఉ-హరి-ఆ-౨. 167 "ధనము జన్మాంతర పుణ్యఫలము ననుసరించి యుండును. ఉత్కృష్టరసానుభవమునకు వెచ్చించుట ద్రవ్యనాశన మునకుఁ గారణము గాదు." 168 ప్రాలు = సౌభాగ్యము. "గృహస్థధర్మముం బఱగడ వైచి గోచికొని పాఱెడుపొల్లదు ముక్తి గల్గునేఁ పడకల నేలఁ గం గొలుచు పాఁతటికిం గలదే తలంపగన్" ఉ-హరి-ఆ-౪. 169. అందు = అందే మఱియు. వాలికల్ = ఏటివాలుప్రదేశములు. చిక్కని = సన్నని. అక్షము = కన్ను. (ఇంద్రియార్థ మైనను లక్షణచేఁ గంటినే యందు వర్తించునని కొందఱు చెప్పెదరు. కమలాక్ష, అక్షపాదాదిశబ్దములలో నయనార్థమే రూఢమైయున్నది.) "కన్ను లేటవాలగుచోట్లు, కనుబొమలు వంకలు, మఱియు హృదయములు నున్నగ జాఱుకట్టలు, వలుదకుచములు వాఁడియగు సన్నని రాళ్ళు, మఱియు, గుణము వాలికము. మనోరతియందె ప్రౌఢలు, కావున నిట్టి స్త్రీజన ముల స్వరూప మిట్టిదని రసతత్త్వజ్ఞుఁడగు పాంచాలపురుషుఁడైన నెఱుంగఁ జాలఁడు." వాలుక లను పాఠాంతరము గలదు. కన్ను లిసుకభూమివలె నెల కొననీయక చలనభావము కలదనుట.

170 వలఁకులు = నేర్పులు. 171. లంజికా = వేశ్యలు. "అమరలంజి కెదుర్ జాగ్గదవాడి" అజిత-ఆ-౫-౭౭. 173. పేర్పిండులు = చెమరు బిందువులు. విడినీరు = కట్టినసీరు. అలుక = చల్లఁగా. 174. చరణాహతిచే నశోకము పుష్పించును. 175 చేయు = హస్తము. 177 ఓటనము = ఓడిన

దైన్యము. కట్టాయము = నిర్బంధము. "రా యెం బీపెన రెల్ల దంతు ముకిసిం ముద్యేమహ కెంతు కట్టాయం పెంపళి వోగె" సంపఫా-ఆ ౧౨. 178 గంటులు = గాయములు. నెట్టి = నేయగా. 179 అందనములు = హారములు. "పొండుక మప్పపొంసుకశిలాకంవొళ్ కనకాభాసిగళ్। ఉండిగెగళ్ మనం గొళిసె ముత్తినలంబిు మొప్పె" ఆరిర-ఆ ౧-౩౬. ఎత్తుపెట్టు = రంజనమిచ్చెడు. 182 అన్నుకు = మిక్కిలి వలపనపు. 186 వెలుపాటె = తెల్లడాటె. 188 రమణ = స్త్రీ. "దేవతారమణాసహం విసియోగ యుంచు" ప్రభా—ప్ర. 190 మాటపొందు = అనుకూలించిన యేకవాక్యము. 202. నెలకట్టు = నియతకుట్టిమ ప్రదేశము. విలంబకములు = వ్రేలాడఁగట్టిన గుత్తులు. 203. పరుసవేదులు = ఇనుమునకు దాఁకినంతనే బంగారము గావింపఁదగు స్పర్శవేధి యను రసశిలా విశేషము. 204. హంసోపకము = పగలు సూర్యతప్తమై రాత్రి సంపూర్ణచంద్రికా శైత్యము ననుభవించిన నీరు. 209. వన్నువు = వర్ణము. పోలుపొందు = సంబంధ సామరస్యము. అలంతికి = మితికి. పూర్వకాలమున ముఖమునకు లోధ్రరజమును జల్లుకొనుటయు, నధరమునకు యావకరసమును పూసికొనుటయు స్త్రీలలో నాచారము. "ఉక్మనైవ సరపాల్పరాక్పతం యావకం యువతివంత వాసని। ఉజ్జహార మువితః పునః పునర్నిష్ఫుబన్నధరపానలోలుపః" జానకీ హరణం. ౮. ౬౦. 212. ముకి = కిరీటము. "విణ్ణో రంబొన్ ముకిమేల్ అశిత్తామరై సెన్ని వైప్పాం" జీవకచింతామణి. ఆ. ౧. హంసతిలకము = రాచిలుక. "ననెయుం భూగళ నాలోకనమాత్రది పడెవ కెంపుమెచ్చం తిలకం। నినగిత్తు దెంపుభూపతి। వనితాతిలకక్కె హంసతిలకను నిత్తం" మల్లి. ఆ. ౯. ౫౮.

వన్ను = బంగారము. అపయము = రంజకము. పసవసంబులు = అలంకారములు.

219. కంపకము = తెర "కంపవసం తెరసీరె" కబ్బిగర కైపిడి-(కాంపము శబ్దితప్పవము) 221 పలయ = సువాసన కలుగఁగా. 223 వన్ను = బంగారపు. 224 ఏకసర ద్విసరములు హారవిశేషములు. తొంగలిపట్టిసు = వ్రేలాడుచున్న సమనుపట్టె. "కట్టిద పంచవర్ణిగెయ పట్టెయతొంగలొ శింద్ర చాపమం। పుట్టిసె తొట్టవజ్రకనచచ్ఛవియొళ్ చపలాకలాపమం। పుట్టిసె" పంప రామా. ౧౩-౫౯. సురంగముగా = అందముగా. 227 వాతపూరణములు =

ధ్వజవిశేషములు. 229 తంపది = తత్క్షణము. 232. శుభోదయమునఁ బారద రస ముబ్బి ప్రవహించు నని రసాయనశాస్త్రము. పరుసవేది = స్పర్శవేధి.

236. తత...సుషిరాత్మకంబులు = వాద్యములు చతుర్విధములు. తతములు-౨౦-పరివాదిని, చతుర్దశీ, ఏకాదశీ, త్రయోదశీ, మహతి, బృహతి, కళావతి, కచ్ఛపి, వితతము, పినాకిని, పౌర్ణము, రావణహస్తము, ఉదుంబరము, షట్కర్ణము, హస్తధము, సారంగి, ఆలావిని, రుద్రవీణ, వ్యాఘ్రముఖము, బల. ఇవి కొనుస్సతో వాయింపఁబడును.

వితతములు. ౧౮. ఝల్లరి, మురజము, భేరి, పటహము, కరడ, కుడుక్క, హుడుక్క, ఢక్క, డమరుకము, నిస్సాణము, సోల్లుక, బాణము, తుంబురి, దుందుభి, మడ్డువు, డిండిమము, ఝర్ఝరము, పణవము. కొట్టి వాయింపఁబడును.

సుషిరములు. ౧౦. పాలిక, కాహలి, వాసము, ముకులి, మధుకరి, వంశము, శంఖము, శుక, శృంగము, సుదర్శవి. శ్వాసముతోఁ బూరింపఁ బడును.

ఘనములు—౬. కాంస్యము, తాళము, ఘంటిక, జయఘంట, క్షుద్ర ఘంట, కర్మ.

237. అంగములు = ముఖవీణ, తాళము మొదలగు నుపాంగములు. 230 కామలు = కావలు. 243 తప్పఁజూచిన = కోపముతోఁ జూడఁగా. చక్కఁ జూచిన = మంచిచూపుతోఁ జూడఁగా, ఋజువుగాఁజూడఁగా. 246 మేలిల్లు = శ్రేష్ఠమగుచున్న. 247 తట్టార్చి = పొలయించి. వెలరెన్ = వెలువడెను. 248. కంటకశయనవ్రతము—బలవన్మరణము నొందఁగోరి ప్రాయోపవేశము సేయు వ్రతభేదము. "రోమాంచని కుచయుగళే శ్వాసగలితమంజుకం నిదధానాత్వత్పాణి గ్రహణతృష్ణయా కంటకశయనవ్రతలీలామివ దక్షిణం కరకమలమనుభావ యతి" కాదంబరి. పావలు = తారకములు. ఆడెనో = వసంతమాడెనో. 250. క్రోవలు = క్రోవ్వులు. పలిగొని = పట్టుకొని. 251 వల్వాలు = సన్నవస్త్రములు. తెరల = కలసిపోఁగా. ముజ్జులు = చిమ్మనగొట్టములతోడి జలక్రీడలు. "అత్తఱిపిటానగరజలు చిత్తమున వసంతకేళి చిసకొత్తంగా మొత్తములుగట్టి తెప్పరి ముత్తెపుజల్లులతోడ ముజ్జుటకొమ్మల్" "మైమెఱుఁగోవఁగ నేర్చెద పే ముజ్జుటలింకఁ దక్కఁ తేనియ"

252. ఉంగవి = తృప్తి. 260 వెడసీర = తెర. 261 మెలుత = స్త్రీ. (మెలియు = సూక్ష్మమగు. మెయిత = తన్వి. ఉకారమధ్యముగానే ప్రాచీనరూపము గలదు కావుననే మెల్తుకయని యగును) 262 వలను = దిక్కు. 263 పొలంతి = స్త్రీ. (పొలుపునదికావునం బొలంతి.) "కలకం గాతరిల్లిన పొలంతుకతో నడ యూరి" ఆర్థ. ౪. 263. తఱకి = వపలి. 271 గెడగాని = జోడుంగూడి "పౌఁజర్వెక్కి యంతె గెడగొండికిదెగెన్ననగద్దెంతుపోవక" లీలా-ఆ-౧౪-౩౭ తుంతుర్వని = తుంపురులు, (తుంతురు = చెదరు; వని = చల్లుటకి వింపుపులు.) "తెరెవొల్లుండాపతుంతుర్వని నిఱతుమం" జగన్నాథవిజయము, ఆ-౧-౫౩. "వనకేళిక్రాంతకాంతాజనపముఖ సరోజంగళాక్ పాయ్ము తుంతుర్వనియం వేఱుత్తె" లీలా-౧౩-౧౧౩. 275. తన్ని = ఊదుకొని. తలకెడవు = తలక్రింపు, వారి = నీళ్లతో. 277 చల్లుంజోరు = నీరుచల్లుకొనునాట. "శతవీరకుమారులతోడ చల్లుంజోరాడి" భార. ఆది. 279. కడలడి = అలల సమూహము

281. బంధుజీవము వనపుష్పములుగాం గొంపఱు కవులు వర్ణించిరి నిక్కము విచార్యము. 284 దాసి = సమీపించి.

285 "జాతే తవ ముఖాంభోజే దృష్ట మిందీవరద్వయం" కాళి.

286 సావి = ఆనెడు భ్రమతో. "యెఱకనికలక్రొన్నిగ్గులు వాసనోత్పల పత్రములు సావిం బాఱమీటు" సాంబో - ఆ - 3. 287 బేలు = ముగ్ధ "కడుందోన మీవేలుంబెల్లకతంబు నెప్పనిను నంప్రీరాత్మనిఞ జేయుమఞ" దళ - ఆ ౬. చదురాలు = నేర్పుకత్తె. 288 వగ = తలంపుతో. తీర్చె = మఱుగుచేసెను. 290 ఒడమి = సొమ్ము. పరివెనలు = వంపువెనలు. 294. చలిమిరి = చల్లంపనము. పెడ = ఎఱ్ఱనగు. "పెడకెంపుటుంగరా లిపగరాదె" ర - రామా. 296 రేక = రేకు. 301 అన్ని = మదించి. 307 మలరు = పుష్పము. "మెరిమలరిలిమము విరిమలరెర్ వరప్పి" మణిమేఖల. ఆ - ౩ - ౧౬౬. "చిత్తజ నిక్షుచాపల తెయుంగెలెవంపుపు పుర్విసొప్పె కణ్బొత్త పయోజ పత్రరుచియం గెలెసంపుపు కణ్మలర్" అణి - ౨ - ౩౭. గెడకత్తియ = సఖి. 307 ఎలనాంగ = యువతి (ఎల = లేత, నాంగ = స్త్రీ, ద్రవిడమున, అనంగై) 312 విన్వంకలు = కొంచెమువంపులు. పొఱలు =

చిగుళ్ళు; 315 కప్పు = నలుపు 317 మూవె = మూగె 318 పసపసలు = సమూహము. 325 తులదెంపు = రాల్చు. తొవిరు = రాఁపుట. డుల్లుకారాకులు = రాలుచున్నపండుటాకులు, ఒప్పు = శృంగారము. 326. మండలార్చనదీర్చి = శ్రీ చక్రమును పూజించి, 327. మైతెంచి = సమ్మతించి.

329. వస్తువు = శాక్తేయులును రసవాదులును సురసముఁగారమునకును వస్తువందురు. కౌళులు = కులాచారులు = శాక్తేయులు. రసాయనము—దేహము నజరామరముగాఁ జేయఁజాలినదివ్యౌషధము, ఇది సిద్ధౌషధులరసము, లేక, యష్టాదశ సంస్కారపూతమగు పాదరసము. సిద్ధౌషధులు ౩౨. రక్తస్నుహి, సోమలతారుదంతి, కృష్ణచిత్రకము మొదలగునవి. 330 ఎరియరె = కాలిపోవరె, 331 నప్పుంబ = అప్పుడ. సిద్ధరసము — సిద్ధౌషధులరసము. ఇది దేహమునఁ బ్రవేశించినంతఁ జొక్కును, మనోదేహభ్రమయును, జర్మస్ఫోటనమును, నఖకేశపతనమును గలిగించి సద్యోజాతత్వమును దయసేయును. (చూడుఁడు సోమలతాకల్పము). కలయ నూల్కొని = దేహమంతయు నుద్రేకింపఁజేసి. 332 వేర్బుందువులు = చెమటబిందువులు. మట్టము = మందము. పురినమ్ములు = పురివిచ్చిన నెమళ్ళు. క్రొవ్విదల్ = జడలు, కొప్పులు. తడుమ = తడఁబాటు వొందునట్లు . ఎడసి = తొలఁగి. 334 అన్ని = ముదెంచి. అంకమాలికలు = బిరుదులుచెప్పి స్తుతిసేయుగానములు. "ఓపనిగె ప్రకటించిపాడిదలశొల్దు గుణప్రియ నంకమాలెయం" లీలా ౮ - ౩౦. సాహురి, పలమంజరము, ఆందోళి, భైరవి' నాట, రాగభేదములు. పౌరాళి యను శబ్దము గ్రంథాంతరమున లభింపదయ్యె. బంగాళియనుటకు లేఖక దోషమాయని నాకుసందేహముగలదు. లేక భల్లారియైనను గావచ్చును.

పలమంజరము — పురుషరాగము. శ్రీరాగోథ వసంతశ్చ సారంగః పలమంజరః. సాహురి, ఆందోళి, భల్లారి, స్త్రీరాగములు. "గుర్జరీ పూర్వగౌళీచ, భల్లారీసాహురీతిచ, ఆన్దోళీతి స్త్రియఃప్రోక్తాః చతురుత్తరవింశతి" పలమంజరికి లక్షణము-"పంచమాంశగ్రహన్యాసా పూర్ణాచ పలమంజరీ హృష్యకా మూర్ఛనా జ్ఞేయా రసికానాం సుఖప్రదా॥ వియోగినీక్లాంతవిశీర్ణగాత్రా స్రజంవహంతీ వపుషాచ శుష్కా ఆశాస్యమానా ప్రియయాచ సఖ్యా సధూసరాంగీపలమంజరీయం" అని సంగీతశాస్త్రము. (ఎక్కువగాఁగోరెడువారు సంగీతసుధను జూడఁదగు).

ఆలతి = ఆలాపము. 336 పంచమహాశబ్దములు = భేరి, కాహళము, పటహము, శంఖము, జయఘంట 342. కేల్లు చేతులు. 343. అన్నువ = అన్నువు + అ = సన్నని. సోవులాడు = ప్రోవిడుచుండు. 344. కొసలించు = తగ్గించు - తలంకించు = తొలంకునట్లుచేయు. సెరవుసేయక = కేసము సేయక = నిర్భయము గా "అంతునిజభుజగదెయం తూగుత్తు మిర్దదంపజూకపతాకన సెరగల్లిద మెయ్యలితనక్కె మెచ్చి తలెదూఁగె" గదా. ౭ - ౪౨. తఱకెంచు = తొలంగించు. మెయ్వడి = మార్గమున. కానిపడిఁపకోలె = సమ్మరింపని క్రీపోలెనే. అలంతి = మితి, అగ్గలింప = దాఁటిపోవఁగా. ఆఁకగొనక = అపుగొనకేత 347 అంజలు = భయము. రూపాంతరము - అంజలి. కాయ్పు = భావరసాతిరేకము. వజ్రలేపములు = వజ్రమును కరంచి రెండు వస్తువులంటింపుచుఁ బూయుట - చెమట బింపువులు పరిపక్వముగాఁ గాఁచిన వజ్రముపలె నుండెనుట. "ఉరదిం పెర్మొలె బెంగెమూడె బెమర్గళ్ బల్వజ్రలేపంగళోలా। గిరె, కీల్గొట్టబెవంగ నీమెన్నల కం, తోళ్గోళ్గెగంజక్కెుదం। తిరె, మెమ్మెయ్యొళదంగు వంతమరె, గాఢాలింగనం గెయ్యున ల్లరదేనిర్దరో కాని బెచ్చతెఱనిం శ్రీసత్యభామాస్మరర్" జగన్నాథ విజయము. ఇందులో నొక్కతలకు రెండు మొగములతో యమకశ్లేష తక్కఁ దక్కిన భావములన్నియుఁ గలవు కాన సంపూర్ణ పద్య ముదాహరించితిని. "నుడిదుడెనన్ని, మాడిదుదెరానన మిత్తుదె రామరేను మా।ర్పడిదువెవజ్రలేపము." శివమొగ్గె తాలూకా తట్టెకరెగ్రామశాసనమున, ౨౪ వ పంక్తి. (మాఱ్ = శత్రువు). మొలలు = చీలలు. 349. కాయువు, కాయుపు—భిన్నరూపములు. 351. మగుడదఁ బడి మగుడఁజూపె. "చోదయత్యపసెరాఙ్ఁసనే రక్షితుం యమునితకృత్యనైపుణం పేహాఙ్క్షరభండితత్రపా సా యయా రహసి కర్మకర్తృతాం" జాన-౮—౨౬.

354. వహిత్రము = ఓడ, తెప్ప. సొగయింపని = చొక్కఁజేయని = ఆసక్తిఁ బుట్టింపని. "సొగయింపనిభంగిమెహదఁడయ్యెమా। యవ్వనవారి పూర్ణసర తాద్భివివర్ధితుఁడై మదించిమై। దివ్వఁడు" అనియుఁబాఠముగలదు. ఇందులో యౌవనశబ్దము "యవ్వన" యని చెప్పుట దోషము. ప్రాచీనకవితలో నిట్టి ప్రయోగములు సాధువులై యుండఁగా వైయాకరణులు నాలంకారికులును దోషపరిచ్ఛేదముల విస్తారముగా వ్రాసి నిందించక కఠినముగాఁ జేసినట్లు తోచుచున్నది. మహాప్రామాణికుఁ డగునన్నెచోడకవి భోజరాజీయమున "నవ్వుచుఁ

జెక్కమీటి నలినస్ఫుటలోచన మాటలేలనీ। యప్పసలక్ష్మికిఁ భటుఁడ నైతి ననుం గరుణింపు మంచు వాఁడువ్విపులాపుడుం బలుక నుత్పలగంధియు నోమహాత్మ" ౬. ౧౦౮. అని ప్రయోగించెను. అనంతునకుఁ బ్రాచీనకవిప్రయోగము లక్ష్యములై యుండును. 360. ఎలసి = ఇచ్ఛగించి 369. తనికిన = తాఁకినయెడల.

371. చదలు = ఆకాశము. 373 మహోదయుఁడు = అగ్ని. 376 తెప్పతి = మూర్ఛతేటి. కడలమ్మ = తరంగసమూహములు. గ్రాము = గ్రహము. వలి = చేతులు కాళ్ల తీడ్పకని మూర్ఛనొందుచునట్టి. 383. అనిమిష = దేవతలు, చేఁపలు. ఖరదండము = క్రూరదండనము, సపసనికాసు. కుముదము = లోకమునకు సంతోషము, కలువ. 380. విద్రుమ = చెట్లు లేకుండుట, పగడపుతీగలు 385 ఎఱఁగి = దిగి. సమూహి = గుంపు. మేలుకట్టు = వితానము. 391 ఎలమెడు = లేలుచుండు. 393 వన్నెప = వర్ణమే. ఉలివు = ధ్వని. 395 దీనిలోనియుపన్యాసము పీఠికలోఁ జర్చింపఁబడును. అకరువు = కేసరములు. 397 ఖండారువు = సొమ్ము 398 కనుబేటంబేటంబు = చూడ్కివలనఁ గలిగిన యనురాగాతిశయము. వివృత = తెఱచిన 401 అక్కలి = సమీపముగా. ఉచ్చలించి = (దేహము) వడఁకి. కర్కెక్క = పులకరింపఁగా. అల్క - చల్లఁగా. 403 దలము = లావు. సరలు = రేఖలు. కప్పిరి = నలుపు. వలిసె = సుడిసె, చుట్టుకొనియె. తనరె = విస్తరిల్లెను. 406 డిగ్గఁదావి = (దిక్కు) వదలి. "ఇన్నాతిడిగఁదావి యేనువాఁడిన మగతనము నిష్ఫల మగు ననితలంచి." "డిగఁదావిపోవక యగపడ్డవస్తువులు" దశ. ౫. 408. ఆపలచి = వ్యసనము. 416. సురభులుచేఁపె = కామధేనువులు పాలు పిదికె. 421 ఎడయాడి = ఎడఁబాసి. విసిని = తామర. తావగొని = విశ్రాంతి గొని. వెలడు = వెలువడు. ముచిమి వో—దీని నీరు చంద్రోదకమువలె రసాయనకల్పము కావునఁ బుస్త్యావసమును దయసేయును. అరిమిలి = ప్రేమ. తమ్మితాల్పుడు = విష్ణుఁడు. 426 కఱుకెక్కి = పులకరించి. 431 కాల్తొనక = కాలూఁదనేరక. మొగతిరుగుడు = పెడమొగము పెట్టఁగా. సారి = చక్రము. 435. అబ్బగింపక = ఓర్వక. 446 తరమున = క్రమముగా. పొంపిరిగొన = నిండఁగా. 447 పాలు = భాగ్యము. 449. ఈపద్యమున నాగాపుబంధములలో నాకచిత్రము గలదని తోచుచున్నది. 450. దీనిలో గోమూత్రికాబంధచిత్రము సైతముకలదు.

453 ప్రభాసము = కాంతి. 455. రామేశకవియను నతఁడు నన్నెచోడుని కాలమునకుఁ బ్రఖ్యాతుఁడై యుండునని ధ్వనితము. ఉబవే = గొప్పతనమా. ఈపద్యదశకము కవి వార్ధక్యమునసో యెవ్వఁడో తెనిఁగించియుండి తరువాత దీనిలో నెక్కించుకొన్నట్లు తోచుచున్నది. 461. ఆత్మవాదులు = కపట వేదాంతులు, లేక కపట యోగులు. వ్యవసాయవాదులు = వ్యవసాయమున నపూర్వమార్గముల నుపదేశించి ఫలాధిక్యముఁ జూపుదు మనెడు కపటదేశికులు. కన్యావాదులు = కన్యలఁ దెచ్చి వివాహము చేయించి ద్రవ్యముగొనువారు. దివ్యౌషధవాదులు = రసాయనౌషధములచేఁ జిరజీవులుగాఁ జేయుదు మనువారు. ధాతువాదులు = తాళకహింగుళకాదిధాతువుల రూపాంతరములఁ గల్పించువారు. 463 ఆధారాధేయ = దేహజీవాత్మరూపసంబంధము వదలి పరమాత్మను బొందుదురు. 466 ఉదరిపడ = భయపడి. 469. గుత్తు = శిబిరములు (గుంపులు) 471 ఎలర్, ఎరల్ = గాలి. పరభాగలీల = పరస్పర సమానశోభ. 474 వెలుఁగఁ దన్నిరాజసద్యోతు లని మార్చినచో నన్వయము సుకరమగును. 477 పరభాగిల్లుచు = సమానముగా శోభిల్లుచు. 478. హయవర్మ = గుఱ్ఱముల కవచములు. 479 అవయవంబునస్ = సేనాంగములచే, జయఘంట మొదలగునవి. రాజ, అబ్జములు-తారక విరోధి విషయములు. 480 లావుపోలె = ఆభరణమువలెనే. 482. చామరలు = వింజామరశబ్దములో స్త్రీలింగరూప మగపడుచున్నది. కన్నడమునకుఁ బ్రతిరూపము కలదు. పడిసేసి – కూలిగా దిన వెచ్చము ను నియమించి.

485. హంసములు వర్షోదబిందువుల కోర్వఁజాలక వర్షర్తువున భూమి నుండి మానసంబునకుఁ బోవునప్పుడు క్రౌంచ మద్దపడి మార్గనిరోధ మొనర్చె. 486 పెట్టు = ఆహతి. ఇరుమెయి = రెండుప్రక్కల, అచ్చరువు = ఆశ్చర్యము. ప్రాకృతకర్ణాటకములం నచ్చరియమని తద్భవము. తెనుఁగున నచ్చెరు వచ్చరు వని రెండురూపములు గలిగె. 491. అఱకొనక = ధర్మము నాలోచింపక. (అఱ = ధర్మము) దొఱవు = క్షేమము. 498. పూన్చి = సేనాంగములు పూనిచి. 503. నోటికండ = భయము. మార్వలసిరి = శత్రువులై గుమిగూడిరి. (మాఱు = శత్రువు) 501 శబ్దాలంకారము. 508. మన్నాన = భూమియందు. "మణ్ణానయుఁ బొన్నానయుఁ। బెణ్ణానయు లేని వాడు పెన్నిఁ ఫలమునున్" కాకమా, 516. ఓర్చుడు = ఓర్చుట, వావిరి = అనుగతముగాఁ జూచెను.

516. రజ్జుచెప్పుడు = ప్రల్లదమునాడుట. చూతె = చూచితివా. 518, తార. కవి, రచిత. ఇందుఁ గవియనఁగా శుక్రుఁడని గ్రహించునపు శబ్దశ్లేష పను పడదు. నన్నె చోడునికాలమునఁ బ్రఖ్యాతులగు తారకవియుం షణ్ముఖకవియు నుండిరని తోచుచున్నది. 519. ఎడసొచ్చి = నడుమఁజొచ్చి, 423. పురుష రత్న = శ్రేష్ఠులగు పురుషులు, పురుషజాతి రత్నములు. వజ్రాదులు, 536. ఉఱఁడు = సరకుసేయఁడు. కలితనము = శూరత్వము. (సామర్థ్యమనుట దోషము) కలితనఁగా శూరుఁడు. "కలిపందె యెందు బగెయదె। కులజం కుల హీన నెందు బగెయదె తరుణం। సలెవృద్ధ నెందు బగెయదె। నెలనువనిన్నిం నికృష్టరెంబరు మొళరే." గదాయుద్ధం. ౯—౯. (ఇంచశ్వత్థామ దుర్యోధనుని దూషించుచున్నాఁడు. కలిపందయనుచుఁ దలఁపక కులఁజుడు కులహీనుఁడనుచుఁ గొంకక యువవృద్ధులలో వివేక మెంచక యలరెడు నీకున్ నికృష్ట లనగాఁ గలరే.") కలితనమునకు—''నినగేనం పెళ్వె నాకామన కలితనమం వీరనా దంగె'' లీలా ౧౧, ౭౧. 526. పవివలని = వజ్రాయుధప్రశక్తిని. పలుకు = తిట్టును. ఏర్చుడు = కాల్చుట, 528. వేల = సాగరము. కొండిక = బాలుఁడు. కోలు = కొనుట. 529. ''ఇంద్రునిమంత్రి దుర్మంత్రమున నింతచేసె" 530. కుదుము = ముద్ద. (ఇప్పడ పుట్టినవాఁడు) తాను = దేవతలు. అక్కల = అయ్యో ఎత్తికొంటిరి = ప్రయత్నించితిరి, 531. చెనయుడు = చెనయుట.

535. గాలాము = చేఁపలఁబట్టుముల్లు. గడ = దండము. కొమ్ము = శృంగము. ఎఱ = ఆహారము. ఎరియ = మండ = కాల్ప. 536. వెలువు = కంచె. 537. పనుఁబాప యను రూపమే సాధువని తోచుచున్నది. "పసని మొగంబులు = లేఁత మొగము లనుచోటనుఁ బసుని యని ప్రాచీనరూపము గలదు". తలము = శక్తి. 538. గంథము = గర్వము. 543. మాత్రుఁడు = మావటివాఁడు. 556. తలియకు = పంటను. 557. ఇమ్ము = ఇక్కట్టు. ఎడపు = ఎడఁబాటు. 561. తెలచు = కోపము తేర్చు "శూరుఁడు ఖడ్గము శత్రువులపైఁ బ్రయోగింపక వంచయై మగిడివచ్చెనేని ప్రణయకోపమున నున్న ప్రాణేశ్వరి పైకిఁగాక మఱియెవ్వరిపైఁ దనఖడ్గముపయోగింపఁగలఁడు." 562. అనిచావు = యుద్ధభూమరణము. 563. పై పెట్ట = పైకివచ్చికొట్టిన ప్రహారణము నకు, 564. ఈ పద్యములోని శ్లేషార్థము నాకు స్ఫురింపకున్నది.

572. ముష్టి = వెంబడి. 578. "అమృతాబ్ధి . . లేక" పోల్చిచూడుఁడు.

"పాలమన్నీటిలోఁ బవ్వళించినయట్టి నీలవర్ణుఁడు నిద్రమేల్కొనియె" విక్ర. యాదము = నీరు. సప్తమికిఁ బ్రథమ చింత్యము. గోపతి = నంది. ఉఱుకు కించి = పిఱుమి.

575. ధారలు = సైన్యపుమొనలో ముందలిభాగములు. "ధారాసైన్యాగ్రిమస్కంధే తురంగగతి పంచకే" వి. ప్ర. తలతంత్రము = యుద్ధభూమిలో మొదట నెదరఁ జేయఁదగిన నాయకుల సమూహము. సహవాసులు = కుబ్జస్త్రీబాద్యంతఃపురరక్షులు. 582 అరదము = రథము. ఇది తత్సమపదమని తోచుచున్నది. 587. ముంగలి = ముందుగా. పింగలి = వెనుక. వాగు = సైన్యము. 590. పించు = పొడి = పిండి, 594. ప్రోవిడు = కుప్పవెట్టు. 595. పీలితొంగళులు = నెమలి యీకలకుచ్చులు. 597. నిట్ట = చక్కఁగాబైకి. 600. మండియ = చావడి. వీళ్లు = శిబిరములు. 604. తర్గంగా = తగ్గఁగా. నుర్గాడన్ = నుగ్గుచేయఁగా. మర్గింతు = మ్రగ్గఁజేయుదును. తర్గు, నుర్గు మర్గు—ప్రాచీన రూపములు. 605. మార్వెట్టక = ఎదిరించి కొట్టక. 606. మగ్గి = మ్రగ్గి. ఉలివినక్రియ = కోసినట్లు. కలికండలు = రూపాంతరము. "నుడియెచ్చం కడిఖండమాగె" పంపరా-౯-౧౨౮. 607. బాకు = చేయిఁటె. నీరు = ధార. గొడుగును ధ్వజమును బట్టుకొనుట జయచిహ్నము. గొడుగు క్రిందివాఁడు సేనాపతియే. 610. కవిదల = ఆక్రమణము. నవడికాఁడు. నవనెధరించిన వాఁడు. ఎడ్దలు = హృదయములు. ఈటె = ఈఁటె. కడితల = పొడిచెడునాయుధ విశేషము. లేక కేడెము. "కెంబలకెయతొలమించంధ్యాంబుదమంపడెదు ఱడిమ కడితలె దూగుత్తంబిడ వెసెవెలంబలగమిందెంపి నెగం తాగెపత్తు భార్గవ సైన్యం." అనం. ఎంప = ఎముకను. ఉర్చుడు = కోసివేయుట. ఏనిక = ఆయుధభేదము. ముక్కోయ్యలు = మూఁడుతునుకలు. గుంటు = ఒక యాయుధము. మాఱుపీట = విరోధిమొనలో. 612. మునుము = తరము = క్రమము. పంచల = కపాలము. "రాహుమంచల ప్రాయమెనిప్పదాన వరపందలెగళ్ రవిమంచలంబరంపాయె" పంపరా. ౧౬. ౬౭. సూర = బలి. పేర్చు = విజృంభణము. "మృదుమాధుర్యరచస్సుధాంబుధిగె పెర్చంమాళ్పచంద్రోదయం మదసంపూజిపమంత్రదేవతె" జగ. 614. పుడమిశబ్దము సంస్కృతమో లేక కరకంఠాదిశబ్దములు వోలె సాధువులయ్యెనో కాని యాంధ్రకర్ణాటభాషలలోఁ బుడమీశాది సమాసములు బహుప్రామాణిక ప్రయోగములలోఁ గానవచ్చు

చున్నవి. కన్నడమున "పొడమేఁగంగదెయ నెత్తి తిరిపిప నాగశ్" గదా. ౮—౪౦.

616 పొడవు = కేవలరూపమును జూడఁగా. ఆళులు = స్త్రీలు. ఆలు = స్త్రీ. తూఱు = ప్రవేశించు, ఎత్తు = పైకెత్తివచ్చు. పోరు = యుద్ధము సేయు. 518 తెరలు = చెదరు 620. గాలిపడగలు = వీరధ్వజములు, వెంద గడియ = ఆకాశబాణములు. వఱడియలు = కరదీపికలు. వీరమద్దెలలు = బిరుదందెలు. 622 ఇప్పుడు = ఇచ్చుట. ఆయము = ఆయువు. లెయ్యము = నెయ్యము. 624 ఓలము = దాఁపఱికము = మఱుఁగు. కూర్చు = ప్రేమించును. ఆలము సేసి = బయలు పెట్టి. ఆలనె = స్త్రీనా. 625. కాన్పు = చూచుట. "నేనే వేవకామినినై యుంతఁ బోరఁ జచ్చి వేఱదేవాంగనలఁ బొందుట కెట్లు ప్రియుఁడు సమకట్టెనని సంచలించె." 635 పడవాళులు = చిన్న సేనాపతులు. 637 ఈవి = ఇచ్చుట. 638 అంగతలత్రములు = కవచము, గోధ. 641 మహామాత్రులు = మావటీలు. 645. జయమాళి = ఒకవ్యూహభేదము. "మకర వ్యూహం బొందెను వికటాస్యంబై నయట్టి వీరాసనమాళికయైనఁ బన్నిచనునది ప్రకటితశౌర్యమున నెపర భయమొదవునెడ౯" అని ప్రాచీనలక్షణములలోఁ జూళీశబ్ద మగపడుచున్నది.

646. మేఘడంబరములో = ఆతపత్రములో. "తలెవరిదానెసుత్తి పలవుం బరెత శిలె మేఘడంబరం। లలనెయరికెచామరమ" పంపరా. ౫—౧౦౮. అరద = రథ. తమ = చీకటి. రజస్సరస్తమోమనశ్శబ్దము లకారాంతములు గలవు. ప్రాయికముగా నాంధ్రమున ముపర్ణకమువచ్చు సకారాంతశబ్దములకెల్ల సంస్కృతమున నకారాంతరూపములు గలవని తోచుచున్నది. "శిరోవాచి శిరశ్శబ్దో రజోవాచి రజస్తథా। శిరశ్చరజ ఇత్యేవ మకారాంతేచ పుంసిచ" "రజోగుణే విశేషుష్మే ర్మాతే స్వాంతే గుణేతమః" శ్రీహర్షుని అమరఖండము. "తమః పుంసి గుణేరాహౌ ఘూకధ్వాంతార్తవాదిషు। తమాతమసుమస్చాపి ధ్వాంతాదిషు నమీహితం" మంజూషా. 653 కాఁపువచ్చు = ఏలుటకువచ్చు 659. పొలుపు = చక్కదనము.

661 వాయవారి = శత్రుపక్షముయొక్క. దొరవారి = ప్రభువును (తారకుఁడు-ప్రభువుగాన నట్టిపేరుగలవారిఁ దెక్కించ్రడను) ఇట్లె-రాచవారు = రాజు, ("కోయిల రాచవారి" = కోయిలరాజును. ఉ. హరి.)

665 వందల = పృక్షై. 672. రేపు = విజృంభించు. 673. చేతులువీచుట-యుద్ధానుజ్ఞ నొసఁగుచిహ్నము. "అంతుబంపుకై పీసుపుడుం" పంపరా. ౧౩-౮౫. 687. నోఁ = నొవ్వఁగా. 688 బరులు = ప్రక్కలు. 690 నలమున = చలమున. మార్బలము = శత్రుబలము. "ఊర్వలదచతుర్బలముం దోర్బలమంమెఱదు మీఱి కాడుప వదదొళ్। మార్వలమం." పంపరామా ౧౦-౧౯౯. నలరేవం = చెలరేఁగునకుఁ బ్రాచీన రూపము. 692 గఱి = (బాణపుంఖములకుఁ దగిల్చియుండు) ఱెక్క. "వికసితనీల నీరజదళం బొలిపల్గఱి" కాదం - ఉత్త. ౬౧ మొల = చీల. నలలు = వత్తులు. పెసులు = పెట్లు = విచ్చు. 694 తొట్టుకొని = ఒకటినొకటి యొరసికొని = నిండి. 695 నెక్కిరి = దగ్గఱించిరి = ప్రక్కకుజేసిరి. వెక్కిరి = వెక్కిళ్లు విడిచిరి. 700 నఱుము = పొడి. నెత్తురుపొత్తు = రక్తసంబంధము. "కుహనా వరాహంబు కూర్మినెత్తుపఁబొత్తుచుట్టంబు లక్కాన సూకరములు." ఉద. ఆ-౩. 704 గజజాతులు. మూఁడు. "భద్రమందమృగభేదత త్రిధా జాతిరత్ర కరిణాం పురోదితా" వీనిమిశ్రము సంకీర్ణజాతి. ఆసనములుమూఁడు "క్రమాత్త్రీణ్యాసనానిస్యుర్ముఖ్యమధ్యాధమానిహి। ఏకఃప్రసారితః పాదస్తదన్యో నత జానుకః। పాశ్చాత్యమాసనం జ్ఞేయ మేకం జానుగతంబుధైః..." అంకుశచారణలు షడ్విధములుగా నవీనులు గ్రహించిరి. నన్నెచోడాదిప్రాచీనులు నాల్గు విధము లనిరి. "వితానేచ విదుర్గ్రీవాసిద్యాణే మస్తకేపిచ। అవగ్రహేచ జానీయాత్ షడ్విధాంకుశచారణా" ప్రణిధులు = మావటీని యాజ్ఞఁ దెలుపు మార్గములు. ఇవి మూఁడు. "వాక్పాదాంకుశచోదనా ప్రణిధిరిత్యుక్తా" ప్రచోదించుచు = తోలుచు. మొగవసంబు = ముఖకవచము. పీసర = వెలిఁతిఁబడి. 713. ఉరిపము = కోఁత. 715. మార్బలము = శత్రుబలము. అత్తలఁ = ఆప్రదేశమున. "అత్తలసురారి బెసనిన నిత్తల్ రుద్రావతార నెళదుద్యప" గదా. ఆ - ౮ - ౨౨. "చాపుతలనైన నించుక సత్యవాక్య ముగ్గడింపు" భోజ -౫ ౩౧౫. 719. అడగొని = అట్టియకట్టి.

726 చోఁటి = మత్స్యము. 730 అలిమి = ఒత్తి. 731. వెక్కువు = వెక్కువ = ఆధిక్యము. 737 రాటనము = రసము తీయుయంత్రము. గుంద్ర = త్రిప్పెడుపైగుండు. 738 కలువు = అలుసు. 739 బరులు = పక్కలు. తెట్టె = చీలి. ఎలఁగి = ఆరోహించి. (ఇవి యవరోహణమున సాధారణముగాఁ బ్రయోగింపఁ

బడును.) 740 నెరణి = మాంసము. వేతాలుఁడు = భేతాళుఁడు 744 ముష్టి = తత్క్షణము. 759 అడగొని = అట్టకట్టి. 760 కెడ్బెరసు = కలసిపోయి. ఖరదండ = జలపుష్పము. ఆయుధవిశేషము. రెండర్థములకును "కృష్ణం పువేభ ఘటాకోటిగళత్తి బర్పఖరదండంగళ్ విఖండంగళా । గెఘనధ్వాంతమనెద్దెపెసాటె పుదిదిర్దాకాశవారాశి ఘోరఘన్మోర్మిప్రకరంబొలేనినిసువేగంకణ్గగుర్వాదుదో" జగ. 763. అరదకమఠము = రథము లను కూర్మములుగలది 768. తవిలించిరి = ప్రేమింపఁజేసిరి. 773 కైపీఁగి = చేప్రాలి. 774. సలలు = వత్తులు. 784 పక్కర = పక్కెరలకుఁ ప్రాచీనరూపము. కందియన = కందెన. 801 కనువడి = తాఁకునట్లు.

802. ముట్టి మూదలించి = తాఁకునట్లు మర్మస్ఫోటనము లాడి పిలిచి. "హరిసంధానక్కె వందం దవగడిసిపహంకార మెల్లిత్తొ కృష్ణాం । బరకేశాకృష్టియం మాడిసిదమద మెల్లితొ కౌంతేయరంమ । చ్చరపింకాంచరాపదోళ్ తిట్టనె తిరుపిద సౌర్కిగ ళేనాదుదెం దా । కురువంశాధీశనం మూపలిసెప నపటం భీమ నుద్దామ భీమం "వ" అంతుముట్టి మూదలిసియు మెంతుం పొడమడిసలాఅదె." గదా - ఆ ౭. ౧౯. తాఁకినమున్నె = తాఁకిన వెంబడి. 807. ముప్పిరివడ = పంక్తిపైఁ బంక్తి పడునట్లు 828. విగుర్వణము = విజృంభణము. 842 కట్టు = కట్ట, 845 కవిదల - ఆక్రమించుట. 856 పొడిపెరిసి = కట్టువదలి. కుముపము = వ్యసనము. సురరాజు = ఇంద్రుఁడనుచంద్రునియొక్క. 867. కుందెలు-కుంద్రెలు - ప్రాచీనరూపము. (కుంద్రు = కొండ. ఎలు = ఎలుక.) 861 కరువపోలె = కరువు పోలెనే, గణప = ప్రమథగణపరుసనెపు.

882. కవి = పూవున. కునిసియాడ = నాట్యమాడ. "గంధర్వరంతల్లి గాయన రింద్రాంగ నెయర్కళల్లి కుణివర్" ఆది - ౪ - ౮౩, "లయదిం దెళలదె కుణిదక్ కెలబర్ కలరుతిగళె తాళమాగె కుణివర్ కెలబర్" ఆది - ౫ - ౩౦. "ఆనందం బెర సంకదచ్చరసెయక్ దేవేంద్ర నైరావతా । లాన స్తంభసమంగళవ్పుఘుటసంచోహంగళోళ్ వీరకాం । తానీకక్కెణెయాగె పాడెపునదర్ మత్తం కెలర్ నోడిసూ । చీనాట్యంగళనాడిదర్" ఆది, ౭ - ౧౨౩. 887. ససియాడితె = తెంపాడితె. 892. తావికొని = ఇటునటు పొలయించి. 902. కాఁచినమద్దులు = కొంచెము కాల్చిన నల్లమద్ది ప్రమాకులవలె. 936 ఎత్తికట్టె = నిలువుకొనెను. 945 ఉద్ద = ఊరక. 946 అపమానము. "అపమానిసి దర్పణా। తపమెలసిద పుండరీక షండదసొబగుం । చపలాక్షియ కోమలమపా। జీవల్లవ స్పర్శ హర్షదిం

రఘురాముం'' పంపరా. ౫-౧౩౧. 958 ప్రోవెట్టు = కుప్పవెట్టును. 960 కొమ్ములు = వింటికొనలు, ఏనుఁగు కొమ్ములు. 963 గహనము = సమూహము. 972 అగుర్వుగ = భయంకర మగునంతయుధికముగ. ''మొనమొనఁ భైరవనం తగుర్వువడెదం రామానుజం'' పంవరా - ౯ - ౧౨౨. 974. ''భుజాస్తంభా గ్రమున జయశ్రీఁబొందె సాలభంజికవిధమున'' — ''శ్రీరాస్తాం మనుమక్షితీశ్వరభుజాస్తంభే జగన్మండల ప్రారంభస్థిరభారధారిణి సదా శ్రీసాలభంజీశ్రియం'' నిర్వ - ఆ ౧ - ౧. 977. చసుము = సమూహము, ముక్కున బంటిన = సహింపరానియట్లుగ. 980 ఈచక్రబంధమునఁ గృతిపతి కృతికర్తృ కావ్యనామములు గానరావు. 987. పరిపూర్ణముగా మనోనురాగాదుల పంపరులకుఁబరస్పర సాహాయ్యసాయుజ్యములు కలిగినను దేహము లెంతయైక్యభావము నెందినను వేఱుగ యుండుటచే వారి సాంగత్యమున నింకయు విరహావస్థ కొంతయున్నట్లే కావునఁ బరిపూర్ణానంద సాయుజ్యమునకు మనసుబాక దేహములు నైక్యమగుటకే యర్ధనారీశ్వర రూపము కావలసి వచ్చెనని కవి శృంగారస్థాయి విభావమునకుఁ బరమోచ్చగతిని వర్ణించెను.

994. నన్నెచోడునికాలమున బృహత్కథ పఠనీయగ్రంథమైయుండును. 995. ఉద్ధృతకందము-భవబంధములుఁ ద్రెంచుచు భువిలో నజ్ఞానవదముఁ బొందకప్రాజ్ఞుల్ । శివుఁగొల్తు రచలభావన దవ్వలఁ సుజ్ఞానయోగ తత్త్వవిధిజ్ఞుల్. 997. ఉద్ధృతకందము—మనమారఁ గొల్చుదరు దాతనిఁ గొల్చియు నావిబోడ దాఁటొరయునెపూ । జనవాదుజోగ్రగ శరపాతనియు కవరంబునంపఁ దాఁ బొర యఁడు పో. 998. హఠాదియోగులు మాంసాహారము రోగరాగజనక మనిరి. భగవద్గీతలో - మాంసాహారము రాజసాహారమని త్యాజ్యమని చెప్పఁబడఁగా శివయోగరాజయోగముల దాని నిషేధింపకుండుట యూహ్యము. ఏ యోగము నందును ప్రారంభమున భోజన నియమము కలదు. నియతేంద్రియుఁడై చిత్తసమాధివైకల్యము చెందకుండెడు స్థితిలో నాహారనియమమును పాటింపడు. అట్టి విజ్ఞానదశనే కవి సూచించెనని తోచుచున్నది. 999. ఈ పద్యమున క్షేత్ర క్షేత్రజ్ఞ సాయుజ్యస్వరూపమును గవి వర్ణించుచున్నాఁడు. క్షేత్రమనఁగాఁ బంచవింశతి తత్త్వములు. ''బుద్ధీంద్రియాణి సార్థాని మనః కర్మేంద్రియాణిచ । అహంకారశ్చ బుద్ధిశ్చ పృథివ్యాదీనిచైవహి । అవ్యక్తమాత్మా క్షేత్రజ్ఞః క్షేత్రస్యాస్యనిగద్యతే.'' 1004. ఏఁచ = వెలుఁగెక్కువసేయుటకు. నిల్ప స్థాపింప (ఆవాహింప).

| పద్యసంఖ్య. | పాదసంఖ్య. | |
|---|---|---|
| 296 | 2 | వెల్లచనియె. |
| 329 | 3 | జక్రియాగము |
| 330 | 2 | న్నరయరె. |
| 346 | | సేయకతీవ్ర. |
| 348 | 1 | సందించుచున్నట్లు |
| 373 | | సాల్చిలినదీపికాస్య నాకినదిపికాకృతిన్ |
| 383 | 4 | శరణవసరని |
| 415 | 4 | సంభవంబులందెలన్. |
| 421 | 1 | నెవంహాడి విసివి కాలిచ్చలో, ముదిమితో |
| 494 | 4 | గనియంగా రోపమంచారకున్ |
| 531 | 2 | కారణ వనవహ్ని కెచ్చటితృణకరంబు. |
| 537 | 6 | పసుఁబావ |
| 538 | 1 | కళాబంధంబు. |
| 538 | 3 | నె య్యానిపైనెత్తిన. |
| 543 | 4 | మహామాత్రుక్రియన్. |
| 567 | 1 | మునసమీరోల |
| 584 | 2 | పరమేశ్వరునంబుధిఁబోలి |
| 615 | 1 | సేవకుసమ్మింపవలయు. |
| 648 | 2 | సంగరాంగణంబునం |
| 649 | 6 | కాయ్పుతో. |
| 663 | 4 | నిర్వేషుఁడామ్యల్ |
| 664 | 3 | విన్నాణములుసూపు. |
| 681 | 2 | హరణవులుశబ్ద. |
| 687 | 2 | నోఁబోట్లు |
| 910 | 3 | యెక్కుదసంచు. |
| 923 | 2 | చెరువాడిరి. |
| 977 | 1 | ముక్కునబందిగ |
| 980 | 4 | శాక్తెయో. |
| 1001 | 3 | లోకాఖ్యమకామ్యదుస్పదిత కుంభ. |
| 1004 | 4 | శేఖరుఁడు సకలముని ముఖ్యుఁడు. |

## కుమారసంభవవ్యాఖ్యానోదాహృత గ్రంథ నామసంకేతవివరణము.

భార = కవిత్రయముమహాభారతము.
విజ = తిక్కన విజయసేనము.
హరి = ఎఱ్ఱప్రెగ్గడ హరివంశము.
నృసిం = నృసింహపురాణము.
భేతా = కవిభల్లటుని విక్రమార్కచరిత.
కలా = పిన్నెచోడుని కళావిలాసము.
ప్రద్యు = విన్నకోట పెద్దన ప్రద్యుమ్నచరిత
కావ్యా = కావ్యాలంకారచూడామణి.
కుమా = ఎఱ్ఱప్రెగ్గడ కుమార నైషధము.
మల్హ = ఎఱ్ఱప్రెగ్గడ మల్హణకథ.
నైష = శ్రీనాథుని నైషధము.
కాశీ = కాశీఖండము.
ఉ. హరి = నాచనసోముని హరివంశము.
సప్త = శ్రీనాథుని సప్తశతి.
వల్ల = వల్లభాభ్యుదయము.
అని = పెమ్మసయని అనిరుద్ధచరిత.
విక్ర = జక్కనవిక్రమార్కచరిత.
నీతి = భద్రభూపాలుని రాజనీతి.
హరిలీ = తెనాలిరామలింగని హరిలీలావిలాసము.
కంద = రామలింగని కందర్పకేతువిలాసము
పద్మి = పేరయ పద్మినీవిజయము.
నిర్వ = తిక్కనయుత్తరరామాయణము.
విక్రమ = అనరేశ్వరుని విక్రమసేనము.
శివ = కవిలోకబ్రహ్మ శివజ్ఞాన దీపిక.
సావి = తులసిబసవన సావిత్రికథ.
దశ = కేతన దశకుమారచరిత.
కాదం = కేతన కాదంబరి.
వీథి = వల్లభరాయని వీథినాటకము.
ప్ర. ప్ర = సూరన ప్రభావతీప్రద్యుమ్నము.
ఉద = సూరనయుదయనోదయము.
శాకుం = పినవీరని శాకుంతలము.
కువ = ఏర్చూరిసింగన కువలయాశ్వచరిత.
ప్రద్యుమ్న = మాధవుని ప్రద్యుమ్నవిజయము

కన్నడమున

కవిరా = అమోఘవర్షుని కవిరాజమార్గ.
విక్రమా = పంపకవిభారతము.
గదా = రన్నకవిగదాయుద్ధము.
జగ = జగన్నాథవిజయము.
అర్ధ = నేమిచంద్రునియర్ధనేమిపురాణము.
మల్లి = అభినవపంపని మల్లినాథపురాణము.

ద్రవిడభాషలో

జీవ = జీవకచింతామణి.
మణి = మణిమేఖలై.
కలిం = కలింగత్తుపరణి.

సంస్కృత ప్రాకృతముల

గౌడ = వాక్పతిరాజ గౌడవధ.
సేతు = ప్రవరసేనుని సేతుబంధము.
నవ = పద్మగుప్తుని నవసాహసాంకచరిత.
కుమా = ఉద్భటుని కుమారసంభవము.
కలా = క్షేమేంద్రుని కలావిలాసము.
శ్రీకం = మంఖకశ్రీకంఠచరిత్రము.
మంథా మంథానభైరవకల్పము.
ఘంట = ఘంటకాపాలికతంత్రము.
రసా = సిద్ధరసార్ణవము.
రసర = నిత్యనాథుని రసరత్నాకరము.
ఔచి = క్షేమేంద్రుని యౌచిత్యవిచారచర్చ మఱియును.

అథర్వణఛందము, కవివాగ్బంధనము, కవిలోకసంజీవని, లక్షణసార సంగ్రహము. (పెద్దన), లక్షణశిరోమణి (వేంకటకవి), అప్పకవీయము, కవిజనాశ్రయము (గోకష్ణుఁడు) మొదలగునవి.

**వివరణము:**

రామకృష్ణకవిగారు 12 ఆశ్వాసముల 'కుమారసంభవము' ను రెండు భాగములుగా వేర్వేరుకాలములలో ముద్రించిరి. మొదటి సంపుటమందు (1909) ఏడు ఆశ్వాసములును, రెండవ సంపుటమందు (1914) తక్కిన ఐదు ఆశ్వాసములును కలవు. నేటి ఆచారము ననుసరించి కవిగారు ప్రతి ఆశ్వాసమునకును వేరువేరుగా పద్యసంఖ్యనీయలేదు-మొదటి సంపుటమున నేడు ఆశ్వాసములందలి మొత్తము పద్యసంఖ్య 996; ఇక రెండవ సంపుటమున నైదాశ్వాసములందలి మొత్తము పద్యసంఖ్య 1009. పాఠకుల సౌకర్యమునకై కవిగారి ముద్రణమును ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమివారు ప్రకటించిన ముద్రణముతో పోల్చి ఆశ్వాసముల పద్యసంఖ్యలను వివరించుచున్నాము-సం॥

| ఆశ్వాసము | కవిగారిముద్రణలో సంఖ్య | అకాడమి ముద్రణలో సంఖ్య |
|---|---|---|
| ప్రథమ | 1-135 | 134 |
| ద్వితీయ | 136-243 | 110 |
| తృతీయ | 244-356 | 113 |
| చతుర్థ | 357-479 | 123 |
| పంచమ | 480-657 | 178 |
| షష్ఠ | 658-881 | 172 |
| సప్తమ | 882-996 | 160 |
| అష్టమ | 1-199 | 199 |
| నవమ | 200-366 | 167 |
| దశమ | 367-570 | 206 |
| ఏకాదశ | 571-781 | 214 |
| ద్వాదశ | 782-1009 | 229 |

